

శ్రీ వాణీ ఆర్ట్ కంబైన్స్

# పుట్టింటి గౌరవం

కథ - నిర్మాత: ఎన్.వి.సుబ్బరాజు

స్క్రీన్‌ప్లే దర్శకత్వం: పి.చంద్రశేఖరరెడ్డి B.A.,

అన్నపూర్ణ ఫిలిమ్స్

ANNAPURNA

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938 - 1972)
శుక్రవారం : 11-4-'75
ఆనందనామ సం॥ ఫాల్గుణమాస అమావాస్య
*సంపుటము : 68 సంచిక : 30*
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

సంవత్సర చందా – రు 33-80 పై.
ఆరుమాసాల చందా – రు 16-90 పై.
విడిప్రతి వెల 60 పైసలు
*ఆంధ్రపత్రిక కార్యాలయము*
గాంధీనగరం, విజయవాడ-520003.


## విషయానుక్రమణిక

# ఈ వేసవిలో మీ పిల్లలకు ఎక్కడ చెమట పేలుడు సంభవిస్తుంది ?




ఎక్కడ పేలినప్పటికీ, జాన్సన్స్ ప్రిక్లీహీట్ పౌడరుతో అరికట్టండి ఒక్క జాన్సన్స్ ప్రిక్లీహీట్ పౌడరు మాత్రమే 3 రకాలుగా పనిచేయు ఋజువైన ఔషధీయుక్త ఫార్ములా కలిగియున్నది

- చెమటను పీల్చుకొని, చర్మముల రంధ్రములు మూసిపోయుటను అరికడుతుంది
- క్రిముల పెరుగుదలను నిరోధిస్తుంది.
- చల్లదనం, హాయిని చేకూర్చి తక్షణ ఉపశమనము చేకూరుస్తుంది

స్నానము తదుపరి మరియు నిద్రపోవుటకు ముందు జాన్సన్స్ ప్రిక్లీహీట్ పౌడరు విరళంగా చల్లండి అది ఒక్కటే తల్లులు విశ్వసించే ఔషధీయుక్తమైన పౌడరు, చెమట పేలుడు నుంచి ఉపశమనము కల్గించేది — తక్షణమే.




చందనపు సువాసనలో గూడా దొరుకుతుంది

## ఒక్క జాన్సన్స్* ప్రిక్లీహీట్ పౌడరు మాత్రమే మంటను ఆపుతుంది, దురదనుంచి ఉపశమనం ఇస్తుంది. తక్షణమే.

Johnson & Johnson*

* Trademark © J&J 75

OBM 4316 TEL




"పశ్చాత్తాపమే పాప పరిహారము"

పెద్ద పెద్ద అక్షరాలతో ఉన్న ఆ వాక్యాన్నే చూస్తూ కూచున్నాను.

అదొక మిషన్ హాస్పిటల్. పెద్ద ఆవరణలో, పచ్చని పచ్చికలో ప్రశాంతమైన వాతావరణంలో నిశ్చలంగా నిలుచున్న చెట్ల మధ్య గంభీరంగా ఉన్న తెల్లని ఆ భవనాన్ని చూస్తుంటే అస్పత్రిలా కాక అభయ హస్తంతో నిలిచే మేరిమాత ఆలయంలా కనిపించింది మా ఆంటీ అక్కడ హెడ్ నర్స్. చిన్నప్పటినుంచి మా పిన్ని అంటే నాకు చాల ఇష్టం. రెండు నెలల క్రితమే ఇక్కడకు ట్రాన్స్‌ఫరై వచ్చారావిడ. మొదటినుంచి నాకు హాస్పిటల్స్ అన్నా, డాక్టర్లన్నా అయిష్టం.

మా బాబులు రాజా, మధు స్కూల్‌కెళ్ళారు నాకు ఏం తోచక పిన్నిని చూద్దామనిపించి ఇలా వచ్చాను అదే మొదటిసారి నేనా హాస్పిటల్ కెళ్ళటం. ఆమె తన డ్యూటీ ముగించుకుని వచ్చి నాకు హాస్పిటల్ చూపిస్తున్నది. "ఇది టి బి వార్డ్, ఇది అవుట్ పేషెంట్స్ వార్డ్, ఇది ఆపరేషన్ రూం. ఇది ప్రసూతి వార్డ్, ఇది పిల్లల వార్డ్. ఇది మేజర్ మైనర్ ఆపరేషన్లు చేసేది " నిస్సహాయంగా పడుకున్న రోగులను జాలిగా చూస్తూ నడుస్తున్నాను "అది డెడ్ రూం" దూరంనుంచి చూపారు ఆంటీ

"ఎవరైనా ఉన్నారా ఆంటీ" కుతూహలంగా అడిగాను

"ఒక చిన్ని పాప ఉంది రా చూస్తావా" తల ఊపాను రూం తలుపులు తీశారు ఒక మాదిరి గదిలో ఇనుప తీగల మంచం మీద గుడ్డల్లో చుట్టి పడుకోబెట్టి ఉంది మూడేళ్ళపాప శరీరం. తను భూమ్మీదకొచ్చిన పని నెరవేరిందన్నట్లు నిశ్చలంగా నిద్రపోతున్నది ఏ తల్లి కన్నబిడ్డో మనసంతా బాధగా అయిపోయింది. అలా చూస్తూ, చూస్తూ మళ్ళా చిల్డ్రన్స్ వార్డ్ లోకి వచ్చాము. ఉయ్యాలలన్నీ నీట్‌గా వేసిన ప్రక్కలతో వరుసగా ఉన్నాయి "కుటుంబ నియంత్రణ ధర్మమా అని డెలివరీ వార్డ్లో బెడ్స్, ఎక్కడ ఉయ్యాలలు చాలావరకు ఖాళీగా ఉన్నాయి" ఒక పాపను ఉయ్యాలనుంచి తీస్తూ అన్నారు ఆంటీ అంతకుముందు ఉయ్యాలలో ఉన్న పాపలందరూ తల్లులదగ్గర పడుకోబెట్టబడ్డారు ఆంటీ చేతిలోని పాప నిద్రాభంగం కలిగించినందుకు కాబోలు చిరాగ్గా కదిలింది నాలుగో నెల వచ్చిందనుకుంటాను బొద్దుగా నల్లని ఉంగరాల జుట్టుతో, చిన్ని గులాబిరంగు పెదాలతో, అందంగా ఉంది తెల్లని ముఖంలో ఆల్చిప్ప లాంటి కళ్ళు "ఎంత బాగుంది ఆంటీ ఎవరిపాప. నాకు ఆడపిల్లలంటే చాల ఇష్టం. కాని నాకు ఇద్దరూ మగపిల్లలే"

"ఎవరి పాప కాదు ఆస్పత్రి పాప"

"అంటే"

"అంటే అది అంతే"

"ప్లీజ్ చెప్పండి ఆంటీ ఎందుకలా..." నాలో ఆతృత ఉరకలు వేస్తోంది

"ఈ పాప వెనుక ఒక కథ ఉంది తల్లి పంజాబి యువతి తండ్రి ఆంధ్రా యువకుడు ప్రేమించానని కబుర్లు చెప్పాడు వాళ్ళు అనుభవించిన ఆనందానికి ప్రతిఫలం లభించబోతున్నదని తెలిశాక పెళ్లి చేసుకుంటానని ఇక్కడకు తెచ్చేశాడు. హాస్పిటల్ లో చేర్పించి తల్లి తండ్రికి చెప్పివస్తానని వెళ్ళి పోయాడు ఈ పాప పుట్టాక చాల రోజులు అతని కోసం ఎదురు చూసింది ఒక రాత్రి అతని పేరు, ఫోటో, వివరాలతో ఉత్తరం వ్రాసి పాప ప్రక్కన పెట్టి ఆత్మహత్య చేసుకుంది పాపం కదూ." వింటున్న నాకు ఆశ్చర్యం, బాధలోపాటు ఆపుదామన్నా ఆగని కన్నీరు జలజలా రాలాయి ఈ పాప పెద్దదైతే ఇంత నిశ్చింతగా, నిటూరించగలదా? తనొక అనాథ అని, తన కెవరు ఆప్తులు, ఆత్మీయులు ఎవరూ లేరని తెలిసిన క్షణంలో భవిష్యత్తులో ఎంత బాధపడుతుందో? జాలిగా గుండెలకు హత్తుకున్నాను

ఇంటికి వచ్చినా నా ఆలోచనలు నన్ను వదలలేదు అంతలో పిల్లలిద్దరూ వచ్చారు. ఆలోచిస్తూనే పిల్లలిద్దరూ అన్నాలు తింటూ ఉన్నారు. "అమ్మా రఘు వాళ్ళింట్లో చిన్ని పాప ఉందమ్మా. భలే బాగుంది." మధూ అన్నాడు.

"అమ్మా మన యింట్లో పాప లేదుగా ఎలా?" దిక్కుమొహం వేసి అన్నాడు రాజా.

మెరుపులాంటి ఆలోచన వచ్చింది నాకు పోనీ ఆ పాపను నేనే తెచ్చేసుకుంటే. ఆ భావం నాలో అంతులేని ఆనందాన్ని కలిగించింది ఎవరైనా కావాలంటే ఆ పాపను యిచ్చేస్తామని ఆంటీ కూడా చెప్పారు. రవి ఎప్పుడు వస్తారా అని ఆదుర్దాగా ఎదురు చూట్టం ప్రారంభించాను వారు ఆఫీస్‌నుండి రాగానే అడిగెయ్యాలి ఎలాగైనా ఆ పాపను తెచ్చుకోవాలి. పాపను స్వంతం చేసుకోవాలన్న కోరిక చాల అర్జెంటుగా చెయ్యాల్సిన పని అనిపిస్తోంది ఎంత ముద్దుగా ఉంది పాప మా కెలాగూ పాప లేదు చిన్నవాడు రాజాకు అప్పుడే మూడోఏడు కూడా వచ్చింది ఎప్పుడు ఐదవుతుందా, ఎప్పుడు రవి వస్తారా అన్న ఆతృతతో సరిగ్గా ఒక్క పనీ చెయ్యలేక పోయాను.

ఎదురు చూసిన సాయంత్రం మెల్లిగా వచ్చింది. రవి వస్తూనే ఇద్దరు స్నేహితులను వెంటేసుకుని వచ్చారు టిఫిన్ తిని మళ్ళా తయారౌతున్న వారిని చూస్తుంటే నాకు నీరసం వచ్చింది "రాదా నా కోసం చూడక అన్నం తినేయి నేను సినిమా కెళ్తున్నాను" అంటున్నవారిని చూస్తుంటే ఒళ్ళు మండింది కాని ఏంచెయ్యను రాత్రి సినిమా నుంచి రాగానే చెబుదామని సమాధానపడ్డాను

కాని రవి స్నేహితుడు అతనిని వదల్లేదు ఎవరో చిన్ననాటి స్నేహితుడు హఠాత్తుగా కనిపించాడు అని తీసుకొచ్చారు అన్నం తిని హాయిగా కబుర్లు చెబుతూ స్నేహితుల ప్రక్కన పడుకున్న వారిని చూస్తుంటే కోపం, ఏడుపు వచ్చాయి ఉదయంనుంచి ఎన్ని అనుకున్నాను సాయంత్రం వారు ఆఫీస్ నుంచి రాగానే టిఫిన్ పెడుతూనో, రాత్రి అన్నం పెట్టేటప్పుడో, తిన్న తరువాత వారు కుర్చీలో కూర్చున్నపుడు చిలకలు అందిస్తూనో అలా ఎప్పుడో ఏకాంత సేవలలో నెమ్మదిగా పాప విషయం చెప్పి రేపు తెచ్చేసుకుందామనుకున్నాను. నా ఖర్మకాలి ఆ స్నేహితుడు ఈ రోజే రావాలా ?

ఎవరైనా అడిగితే పాపను యిచ్చేస్తామని చెప్పారు ఆంటీ. దేవుడా ఎవరు రాకుండా ఉండాలి. పాపను ఎలా తెచ్చుకోవటం? ఆలో

చనలతో నిద్రపట్టపట్టక ఆ రాత్రి గడిపే శాను మర్నాడు రాత్రికి గాని వారికి విషయం చెప్పటం కుదరలేదు.

నేను చెప్పిందంతా శ్రద్ధగా విని "నీకే మైనా పిచ్చి పట్టిందా మనకిక పాపలే పుట్టరా? రాజాకు మూడేళ్ళు వస్తేమాత్రం. మనమేమన్నా ముసిలాళ్ళమై పోయామా" ఆయన నిర్ణయం వింటే అరగంటనుంచి మొత్తుకున్నదంతా బూడిదలో పోసిన పన్నీరా తున్నందుకు బాధగా ఉంది

"కాదండీ ఆ పాపకు తల్లీ తండ్రీలేరు చాల బావుంది మనం తీసుకుంటే ఒక అనాథకు ఆశ్రయమిచ్చినట్లు ఉంటుంది మన పిల్లల్లో కలసిపోతుంది కూడా" చివరిసారిగా ప్రయత్నించాను

"పిచ్చిపిల్లా! అలాంటి అనాథలు ఈ దేశంలో ఎందరో ఉన్నారు. రోజుకు ఎంతమంది అనాథలుగా పుడుతున్నారో. వాళ్ళందరికీ నువ్వు ఆశ్రయం ఇవ్వగలవా. అమ్మవై ఆదరించగలవా? నీకంత జాలిగా ఉంటే కొంచెం డబ్బివ్వు. అసలా హాస్పిటల్ కెందుకెళ్ళావు? పిచ్చిగా ఆలోచించక పడుకో" చేయి చాచి దగ్గరకు తీసుకుంటూ అన్నారు

నా మనసులో అశాంతిగా, ఏదో మంటగా ఉంది, కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి ఎంత మరిచిపోదామని ప్రయత్నించినా చిన్నారి పాప మరుపు రావటంలేదు. నిద్రరాని కళ్ళతో అలా ఆలోచిస్తూ, బాధపడుతూ పడుకున్నాను నా ఆలోచనతో పని లేదన్నట్లుగా తెల్లారిపోయింది.

* * *

వారం రోజుల వరకూ కోపంతో రవితో మాట్లాడలేదు పాపను తెచ్చుకోలేనని తెలిసి-కూడా పాపమీది మమకారాన్ని చంపుకోలేక పోయాను రోజూ హాస్పిటల్‌కి వెళ్ళి పాపను ఎత్తుకుని ఆడించి వచ్చేదాన్ని నా అదృష్టమో పాప దురదృష్టమో పాపకోసం ఎవరూ రాలేదు పాపకు సరోజ అని నేనే పేరు పెట్టాను, నేను వచ్చే టైముకి నాకోసం కిటికీలో కాచుకుని కూచునేది నన్నంత దూరాన చూస్తూనే 'అమ్మ, అమ్మ' అంటూ కేరింతలు కొట్టేది

రెండు సంవత్సరాలు గడిచిపోయాయి. పాప నా ఆరోప్రాణం అయింది మా ఇంట్లోకి మరో కొత్త మెంబరు వచ్చాడు. క్రితంసారి రెండుసార్లు పాప కావాలను కున్నాను కాని ఈసారి మాత్రం పాప పుడు తుందేమో, సరోజమీది మమత తగ్గిపోతుం దేమోనని భయపడ్డాను హాస్పిటల్‌లో నెల రోజులు ఉండాల్సివచ్చింది ఈ నెల రోజులు



సరోజను వదలి క్షణం ఉండలేదు. పసివాడినికూడా అంత శ్రద్ధగా చూడలేదేమో. ఇది ఏ నాటి అనుబంధమో? ఆరోజు సరోజ పుట్టిన రోజు.

హాస్పిటల్ నుంచి వచ్చి వారం రోజులౌతుంది. మొదటి, రెండవ పుట్టిన రోజు పండుగలు సరోజ మాఇంట్లోనే గడుపుకుంది. సరోజకు కొత్తగౌనుతొడిగి హాస్పిటల్‌స్టాఫ్‌కు స్వీట్స్ పంచిపెట్టేదాన్ని. ఆ రోజు కూడా పాపను ముస్తాబుచేసి ఇంటికి తీసికెళ్దామని గౌను, గాజులు, స్వీట్స్ అన్నీ తెచ్చాను. హాస్పిటల్‌కెళ్ళి సరాసరి సరోజ ఉండే దగ్గరకు వెళ్ళాను నన్ను చూడగానే 'అమ్మా', అంటూ పరుగున వచ్చే పాప కనుపించలేదు.

ఆంటీ రూంకి తీసుకెళ్ళారని అక్కడి డ్యూటీ నర్స్ చెప్పింది. కొంచెంసేపు ఎదురు చూసి ఇక ఆగలేక నేనే బయలుదేరాను. వరండాలో ఆ చివరనుంచుని ఎవరో కారులో ఉన్న వాళ్ళకు టా! టా! చెప్తున్నారు కారు వెళ్ళిపోయింతరువాత ఆంటీ లోపలికివచ్చారు. నా కళ్ళు సరోజ కోసం అసహనంగా వెతుకుతున్నాయి 'నమస్తే ఆంటీ, పాపఏది ఈవాళ సరోజ పుట్టినరోజుకదా ఇంటికి తీసికెళ్ళాలి. ఇందస్వీట్స్ నాకు టైమ్ లేదు ఈ సారి స్టాఫ్‌కు మీరేపంచండి త్వరగాసరోజనివ్వండి'' గుక్కతిప్పుకోకుండా మాట్లాడుతున్న నన్ను చూసి ఆంటీ నవ్వుతూ 'రాధా నీకో శుభవార్త చెప్పనా' అన్నారు

''ప్లీజ్ ఆంటీ శుభవార్తలు తరువాత ముందు సరోజనివ్వండి'' పాకెట్స్ పట్టుకుని నిలబడుతూ అన్నాను.

''తొందరపడకు నిదానంగాకూచునివిను. ఈ రోజు ఓ గమ్మత్తు జరిగింది. సరోజ తండ్రికి ఇన్నాళ్ళకి జ్ఞానోదయం కలిగింది కాబోలు కూతురుకోసం వచ్చాడు. ఆమె అడ్రస్ చెప్పమన్నాడు చనిపోయిందనిచెపితే, తనఅసమర్థకు బాధపడ్డాడు సరోజనైనా యిమ్మని అడిగి తీసికెళ్ళిపోయాడు ..''మా ఆంటీ చెబుతున్న తరువాత మాటలు వినిపించలేదు నాచేతిలోని పాకెట్ జారిపడిపోయింది.

సరోజ వెళ్ళిపోయింది. నమ్మలేకుండా ఉన్నాను ఇంకా సరోజ ఎక్కడనుండో 'అమ్మా' అని పిలుస్తున్నట్లుగా ఉంది—ఆగని కన్నీరు జలజలా చెక్కిలిపై రాలింది ''ఛా ఏమిటి రాధ. నువెప్పుడు బాధపడే దానివిగా. తనకెవరూ లేరని. సరోజకు ఇప్పుడు కన్న తండ్రి ఉన్నారు. లోకంలోని అందరిలాగానే తనూ ఆనందంగా ఉంటుంది. బి. హాపీ మై చైల్డ్'' ఓదార్చారు ఆంటీ.

ఉత్త చేతులతో వెనుతిరిగాను. ఇంటికెలా వెళ్ళానో నాకే తెలియదు మనసంతా శూన్యమై పోయింది. పోనీలే కన్నతండ్రి దగ్గర సరోజ అందరిలా పెరుగుతుంది నే నెలాగూ తీసుకునిరాలేను. ఎక్కడో ఒకచోట సరోజ సుఖంగా ఉంటుంది అంతే చాలు. నన్ను నేనెంత ఊరడించుకున్నా మనసు సమాధానపడలేదు, అన్నం తినకుండా ఏడుస్తుపడుకున్న నా దగ్గరకు వచ్చాడు మధు వర్షించబోయే మేఘాల్లా ఉన్నాయి వాడి కళ్ళు. ''సరోజ వెళ్ళిపోయిందని ఏడుస్తున్నావా అమ్మా నేను తెచ్చిస్తాగా ఏడవకు''చిట్టి చిట్టి చేతులతో నా కన్నీళ్ళు తుడుస్తున్న వాడిని దగ్గరకు తీసుకున్నాను. కాలం జరిగిపోతోంది. సరోజ జ్ఞాపకం వచ్చినపుడల్లా దాని ఫోటోలు ముందు పెట్టుకునేదాన్ని, ప్రతి పుట్టినరోజుకు సరోజ పేరుమీద కొంత డబ్బు బట్టలు హాస్పిటల్ కిచ్చేదాన్ని.

## 2

పదహారు సంవత్సరాలు గడిచిపోయాయి పెద్దవాడు మధు నాగపూర్‌లో బియ్యే చదువుతున్నాడు తరువాత రాజా బియస్సీ. రఘు ఇంటర్ మధు ఒక్కడే అంత దూరాన ఉన్నాడు వాడంటే నాకు కొంచెం ఇష్టం ఎక్కువ. మధును వదలిఉండాలంటే మొదట చాల బాధపడ్డాను. రెక్కలొచ్చిన పక్షి ఎగరటం సహజం కదా. మొదటిసారి శెలవలు యిచ్చినపుడు ఒక్క రోజుకూడా ఆలస్యం చెయ్యకుండా ఇంటికి వచ్చేశాడు.

నాగపూర్ నీళ్ళు ఒంటికి పడి కొంచెం లావెక్కాడు పచ్చగా, ఆరోగ్యంగా ఉన్నాడు. మొన్నటిదాకా నా ఒడిలో ఆడుకున్న మధు హఠాత్తుగా ఎదిగిపోయినట్లుగా అనిపించింది. తృప్తితీరా చూసుకుని దిష్టి తీసివేశాను ఆ రాత్రి అక్కడి కాలేజీ కబుర్లు, స్నేహితుల కబుర్లు చెప్పి నవ్వించాడు హాస్టల్‌లో సౌకర్యంగా లేదని వేరే గదిలో మరో ఇద్దరు స్నేహితులతో ఉంటున్నాడట. మధు ఉన్న నెల రోజులు చకచకా గడిచిపోయాయి వెళ్ళే రోజున వంగి నా కాళ్ళకు దణ్ణం పెడుతున్న మధును దగ్గరకు తీసుకుని కళ్ళనీళ్ళు పెట్టుకున్నాను

''అమ్మా నువ్విలా బాధపడితే నేను వెళ్ళను వెళ్ళినా అక్కడ ఉండలేను.'' చిన్న పిల్లాడిలా నా భుజం మీద తల వాల్చి అన్నాడు మధు.

''ఛా. లేదురా నాన్నా వెళ్ళు'' కళ్ళు తుడుచుకున్నాను

''బాగుంది ఆడపిల్లను అత్తారింటికి పంపినట్లు ఏమిటీ అప్పగింతలు'' నవ్వుతూ వెక్కిరించారాయన. ఆ మాటతో నాకు హఠాత్తుగా సరోజ గుర్తుకొచ్చింది. సరోజకిప్పుడు పెళ్ళీడు వచ్చి ఉంటుంది ఆడపిల్లలు



# ఘటన

ఎంతలో ఎదుగుతారు. బహుశా పెళ్ళైపోయిందేమో? చీరల్లో ఉన్న సరోజను ఊహించుకుందామన్నా 'అమ్మా' అంటూ చేతులు చాచే చిన్నారి పాప రూపు మాత్రమే గుర్తొస్తున్నది. ఏం చేస్తుందో, ఎక్కడ ఉందో, ఎలా ఉందో నిట్టూర్చాను. మరునాడు సరోజ పుట్టిన రోజు. చక్కని నైలెక్స్ చీర, దానికి సరిపడే బ్లౌజ్ పీస్ తీసికెళ్ళి ఆంటీ కిచ్చాను. మామూలు చిరునవ్వుతో అందుకున్నారు ఆంటీ. మరి రెండు సంవత్సరాలు గడిచిపోయాయి.

మధు చదువు ఇంకో ఏడాదితో అయిపోతుంది. వాడికప్పుడె పెళ్ళి సంబంధాలు వస్తున్నాయి. శెలవలకు ఇంటికి వచ్చిన మధు ఈసారెందుకో హుషారుగా లేడు. వచ్చిన దగ్గర నుంచి గమనిస్తున్నాను. ఏదో చెప్పలేక బాధపడుతున్నట్లుగా ఉన్నాడు. ఒక రోజు రాజా, రఘు సినిమా కెళ్ళారు. వారు ఎవరో ఫ్రెండింటి కెళ్ళారు. వసంతా అయింది. తీరిగ్గా కూచున్నాను. మధు నా ఒళ్ళో తల పెట్టి పడుకున్నాడు.

"చిక్కిపోయావేరా నాన్నా. బాగా చదువుతున్నావా."

"లేదమ్మా. అమ్మవు కదూ నీ కళ్ళ కింకా పాపాయిలా కన్పిస్తాను."

నిజమే నాకు చిన్నవాడిలా కనుపిస్తున్నాడు పిచ్చివెధవ వీడి కప్పుడే పెళ్ళేమిటి అనుకున్నాను.

"అమ్మా"

"ఏమిటి నాన్నా"

"నే చెప్పేది విని నన్ను క్షమిస్తావా అమ్మా"

ఉలిక్కి పడ్డాను. "అంత క్షమించరాని తప్పు చేశావా మధూ."

"లేదమ్మా. నా దృష్టిలో అది తప్పు కాదు."

"మరి... చెప్పు"

ఒకసారి నా వైపు చూసి కళ్ళు దించుకున్నాడు. ఆ కళ్ళల్లో సన్నని బెదురు. మీసకట్టు వచ్చినా పసితనం వదలని ముఖం. ఏం వినాల్సివస్తుందో నాలో ఏదో ఆందోళన.

"నాగపూర్‌లో మా ఇంటివారమ్మాయి జ్యోతి. బియస్సీ పాసైంది. తల్లిలేదు. తండ్రి ఇంజనీర్. ఆంధ్రాస్ కాదు. తనకు మనసిచ్చాను. మాటకూడా యిచ్చాను. నువ్వు నాన్నగార్ని ఒప్పించగలవనే ధైర్యంతో వున్నాను. వాళ్ళ నాన్నగారు మా పెళ్ళికి తొందరపడుతున్నారు. అందుకని...మరి..."

హఠాత్తుగా మనసు మూగబోయింది. మధు నేటినుండి సరిక్రొత్త సమస్య. క్రిందటి క్షణంవరకూ పసివాడిగా కనుపించిన మధు, అందుకోలేనంత ఎత్తుగా ఎదిగిపోయాడు. చాలాసేపు మౌనంగా కూచున్నాను. నా జవాబుకోసం నిరీక్షిస్తున్నాడు. ఏం చెప్పాలో తోచలేదు. "నిద్రపో నాన్నా. ఆలోచిస్తాను." లైటార్పి క్రిందకు వచ్చాను. మధుకు చెప్పానే గాని నాకా రాత్రంతా నిదలేదు.

"తెలుగు పిల్ల కాదు. కులం, మతం అలా ఉంచినా భాష కూడా ఒకటికాదు. ఆయన ఒప్పుకుంటారా? అసలెలా ఒప్పించను. బంధువులంతా ఏమనుకుంటారు. ముఖ్యంగా పరాయి రాష్ట్రపు పిల్లను చేసుకుంటే మధు నాకు దూరమౌతాడేమో?" ఈ ఊహ గుండెల్లో ముల్లులా మంటరేపుతుంది. ఇది భరించలేను. నాకు ఆడపిల్లలు లేకపోవడంతో వాళ్ళ పెళ్ళిళ్ళు కావేమోననే భయంలేదు. కాని ఎలా? ఎద్దుని బాసిస్తే కన్నీరు పెడితే మధు కాలు కదపలేడు. కాని ఆ నీలి కళ్ళలో ఇంక వెలుగుండదు. చిన్నప్పటినుంచి అంతే. సున్నితమైన మనసు వాడిది. వాడు ఇష్టపడింది. నాకిష్టం లేని పని ఏదైనా చెయ్యవద్దని గట్టిగా కసురుతే చేసేవాడు కాదు. కాని ఆ రోజంతా ఓడిపోయినట్లు ముఖం దించుకుని దిగులుగా ఉండేవాడు. మధు జీవితంలోని అశాంతిని మాత్రం భరించగలనా? అలాగాని ఈ పెళ్ళికి ఒప్పుకుని అయిన వాళ్ళందరికీ దూరమై, మచ్చలేని ఈ కుటుంబపు పరువును, వారి మర్యాదను మంటగలపగలనా? ఎలా ... ఎలా ఈ సమస్యను పరిష్కరించను. ఆలోచనలతో తెల్లారిపోయింది. రోజంతా మధును తప్పించుకుని తిరిగాను. మరునాడు మా దూరపు బంధువు ఒకాయన వచ్చి వాళ్ళింట్లో పెళ్ళని ముగ్గురు మగపిల్లల్ని ఎలాగూ సెలవులే కదా రమ్మని బ్రతిమిలాడి తీసికెళ్ళాడు. వారం రోజుల తరువాత వచ్చారు ముగ్గురూ. వారం రోజుల వ్యవధి దొరికింది గాని నా ఆలోచనలకు అంతుచిక్కలేదు. ఒకవైపు మధు భవిష్యత్తు, మరో వైపు కుటుంబ పరువు ప్రతిష్ఠలు.

"అమ్మ! వారం రోజులకే ఇంత చిక్కి

పోయావేం'' అన్నం తింటూ అడిగాడు రాజా.

''అన్నయ్యమీది వెంగకదమ్మా'' చిలిపిగా అన్నాడు రఘు.

''నీ మొహంలే తిను'' ఆలోచనతో మానసికంగా అలసిన నేను శారీరకంగా చిక్కినట్లు కనుపించానేమో. ఒకసారి నావైపు చూసి తలదించుకున్నాడు మధు.

''క్షమించమ్మా! నా వల్లనే కదూ'' అన్నట్లున్నయ్యా చూపులు.

ఆ సాయంత్రం వంటపనిలో బిజీగా ఉన్న నా దగ్గరకు వచ్చాడు మధు.

''ఏం కావాలిరా!''

''ఉత్తరం వచ్చిందమ్మా!''

''ఉత్తరమా. అక్కడ పెట పనిలో ఉన్న నేను చాల సేపట ఉత్తరాన్ని చూడలేదు. విప్పాను.

''డియర్ మధూ

రేపు మూడున్నర ఎక్స్‌ప్రెస్‌కి వస్తున్నాడు. రిసీవ్ చేసుకో. మర్చిపోకు. ఎక్స్‌ప్రెస్ మూడున్నరకు.

నీ జ్యోతి.

గులాబీరంగు కాగితంమీది ఆకుపచ్చని అక్షరాలు ముద్దుగా, పొందికగా ఉన్నాయి. ఉత్తరం ప్రక్కనపెట్టి పనిలో మునిగిపోయాను. మధ్యాన్నం రెండైంది. నిద్రపోతున్న మధును లేపుదామని గదిలో కెళ్ళాను. పరీక్షగా చూడలేదు గాని పిచ్చి వెధవ చిక్కిపోయాడు. బుగ్గలపై కన్నీటిచారలు. నా గుండెల నెవరో నొక్కుతున్నట్లుగా బాధపడ్డాను. మధు కన్నీరు పెట్టటం అరుదైన విషయం. ఎలాంటి బాధనైనా మౌనంగా భరిస్తాడు. ఈ ఉదాహరణ చాలు మధు హృదయంలో జ్యోతికి ఉన్నస్థానం ఏమిటో చెప్పటానికి.

“మధూ లేవాన్నా” నెమ్మదిగా తలమీద చెయివేశాను. ఉలిక్కిపడి లేచాడు. “లేచి ముఖం కడుక్కోనిరా. టిఫిన్ తిందువుగాని, రెండైంది. స్టేషన్ కెళ్ళాలిగా” మధుకళ్ళల్లో ఇంద్ర ధనస్సులాంటి మెరుపు. నిట్టూర్చాను.

ఆ అమ్మాయిఎవరైనాఎలాంటిదైనామధు స్నేహితురాలు. ఇంటికొచ్చిన ఆడపిల్లను అవమానించకూడదు. తరువాత సందర్భాన్ని బట్టి చూసుకోవచ్చు. చదువునేర్పిన సంస్కారం నాలో మాసిపోలేదు. ఇంతలో ఫోన్ మ్రోగింది.

“హలో.”

“హలో రాధా. సరోజ వచ్చింది. చూస్తావా.”

“ఆంటీ...ఆంటీ...ఏమిటి మీరంటున్నది. సరోజ...నా పాపవచ్చిందా? ఇప్పుడే వచ్చిందా. వస్తున్నాను ఆంటీ”

“ఓహో...రాధా...తొందరపడక. సరోజ రేపు వస్తుంది. రేపుదయం రా”

ఒక్కక్షణం నీరసంగా అనిపించింది. ఇంతలో గుమ్మంలో టాక్సీ ఆగింది. ఫోన్ పెట్టేసి వీధిలోకి నడిచాను. మధు వెనుక తల వంచుకుని వస్తోంది ఆ అమ్మాయి. సన్నగా, తెల్లగా, నాజూగ్గా, చిన్ని పెదాలతో, పెద్ద కళ్లతో ఆకర్షణీయంగా ఉంది జ్యోతి. అందరికీ పరిచయం చేశాడు. “మా అమ్మ.”

కళ్లనిండుగా ఆనందం నింపుకుని ‘నమస్తే’ అంది వినయంగా.

## ఘటన

ఆ కళ్లలో సరోజ కనుపించింది. లోపలికి తీసికెళ్ళాను. మరునాడు ఆంటీ ఫోన్‌కాల్ కోసం చూస్తున్నాను. జ్యోతి, మధు, రఘు, రాజా ఎక్కడికో వెళ్ళారు. గణగణా మ్రోగింది ఫోన్.

“హలో” గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి.

“రాధా. సరోజ వచ్చింది. రా”

ఆనందంతో చేతిలోని రిసీవర్ జారిపోయిందనుకున్నాను. ఒళ్ళంతా చెమట పట్టేసింది. అంతు తెలియని సంతోషంతో ఉక్కిరి బిక్కిరి అయినాను.

“ఎన్నాళ్ళకు పాపను చూడబోతున్నాను. నా పాప నన్ను గుర్తిస్తుందా? అమ్మా అంటూ దగ్గరకు వస్తుందా లేక దూరంనుంచే నమస్తే... ఊహూ అలా కాకూడదు.” టాక్సీలో హాస్పిటల్ దగ్గరకు వచ్చాను. పరుగెడుతున్నట్లు ఆంటీ రూంలోకి వచ్చిన నాకు అక్కడ ఆంటీ ఒక్కరే కనుపించారు.

“నమస్తే ఆంటీ పాప ఏది...” త్వరగా రావటంవల్ల ఆయాసపడ్డాను. మామూలు చిరునవ్వుతో చూస్తూ.

“కూర్చో...కూర్చో ... ఈనీళ్ళు త్రాగి అలసట తీర్చుకో ముందు.” అన్నారు ఆంటీ. గటగటా నీళ్ళుత్రాగి. “చూపండి” అన్నాను. ఇద్దరం మరో రూంలోకి వెళ్ళాము.

“ఇదిగో నీ పాప.”

మధు ప్రక్కన కూర్చున్న జ్యోతి అయోమయంగా చూస్తోంది. నా కర్థం కాలేదు.

“సరోజా.ఈమె నువ్వు చూడాలని వచ్చిన అమ్మ” ఆంటీ మాటలతో ఈ లోకంలోకి వచ్చాను. రెండడుగులు వేశాను. ప్రపంచం గిర్రునతిరుగుతున్నట్లుగా అనిపించింది. నీళ్ళు నిండిన కళ్ళకు మసగ్గా కనుపించింది ఇన్నాళ్ళూ జ్యోతి పేరుతో పెరిగిన సరోజ. చేతులు చాచేలోగా కుప్పకూలిపోయాను. తిరిగి కళ్ళు తెరిచేసరికి సోఫామీద ఉన్నాను. ముందుగా కనుపించింది సరోజ. పదహారేళ్ళ మమతా ఒక్కసారి గుండెల్లో పొంగింది. ఆర్తిగా చేతులు చాచాను.

“అమ్మా. అమ్మా”అంటూ సరోజ నా కౌగిలిలో వాలిపోయింది. చిన్నారి సరోజ “అమ్మా” అన్నట్లుగా అనుభూతి చెందాను. పిచ్చిగా గుండెల కదుముకుని కన్నీటితో తడిపేశాను. నా కెంత తృప్తిగా, గర్వంగా, ఆనందంగా ఉంది.

“రాధ. ఈ రోజు నీకు పండుగ కదూ” నవ్వుతున్న ఆంటీ నా కళ్ళకు దేవతలా కనుపించారు. “ఆంటి మీకొక శుభవార్త. ఈ సరోజే నా యింటికి కోడలుగా వస్తోంది. చిన్నప్పుడు కూతురుగా ఇక్కడ నుంచి తీసికెళ్దామని ప్రయత్నించి, వారి మాట కాదన లేకపోయాను. సరోజకు దూరమై బాధ పడ్డాను. ఇప్పుడు నా బాబు మధు తోడున్నాడు. అందుకే సరోజను నా ఇంటికి దీపంగా చేసుకుంటున్నాను.” మధు, సరోజల ముఖాలు ఆనందంతో వెలిగాయి. ఆ క్షణంలో లోకం, బంధువులు, పరువు, ప్రతిష్ఠ, జాతి, భాష ఏవి గుర్తు రాలేదు. నిండుగా నా కళ్ళకు కనుపిస్తున్న మధు, సరోజలు తప్ప.

### కాదేదీ కవిత కనర్హం

రాత్రివేళ వస్తావు,
రాత్రివేళే పోతావు,
రానైనా రావు పగలు
తెలియకుండా వస్తావు,
తెలియకుండానే పోతావు,
అలసి సొలసి ఉంటాను నేను,
అలాగేవచ్చి పడుకుంటాను,
ఎప్పుడోవచ్చి పలకరిస్తావు,
నిద్రనుంచి లేపుతావు,
చురుక్కుమని లేస్తాను నేను,
ఎక్కడో దాక్కుంటావు నీవు,
నేనంటే, నీకెందుకే యింత ప్రేమ
నల్లీ,
నా తీయనైన రక్తమేనా? నీకు
కానుక నా నల్లి!?

—రామలక్ష్మి, జి.

మిగతా పంకాలకన్న పది రూపాయలు ఎక్కువ యిచ్చి, క్రింద శేషు ర్యాలిఫాన్  తెచ్చినందుకుగాను, శర్మగారు రాముూ పైన ఎంత కోపగించుకున్నాడోగాని, ఆ ర్యాలిఫాన్  ఏమాత్రం పేచీ పెట్టకుండా గది అంతటికీ గాలిని యివ్వడం చూసిన తర్వాత, బస్తీ అంతట్లోనూ ర్యాలిఫాన్‌ను  గూర్చి తెగ పొగిడారు. ధర కొంచెం ఎక్కువని డాబా యింటి రామయ్యగారు మొదట్లో పేచీ పెట్టారుగాని, పిల్లలు చదువుకునే గదిలో రాత్రంతా ర్యాలిఫాన్  ఏమాత్రం చప్పుడు చేయకుండా నడవటం చూసిన తర్వాత, నాలుగు రూపాయలు ఎక్కువ యిచ్చినా మరేమీ ఫర్వాలే దనిపించింది. ఆకర్షణీయమైన వల, మిగతా వాట్లలో కలిసిపోగల రంగు కోసం మరి కొస్త ఎక్కువ ధర పెట్టడానికి వెనకాడని రహీమ్ సాయిబు, ఎంతో సంతోషంగా ఉన్నాడు. ఎందుకంటే, ఆయన ర్యాలిఫాన్  యివాళ కూడా కొత్త దాని లాగానే కనిపిస్తుంది, కొత్త దానిలాగానే నడుస్తుంది.



మంచి పంకా తీసుకోవాలన్నప్పుడు,
మీరు ఏ పంకా తీసుకోవాలో **ర్యాలిఫాన్**కు ఎంతో బాగా తెలుసు.

U-RTF-23 TEL

(గత సంచిక తరువాయి)

గంగ వచ్చిన మరుక్షణం నుంచే మొదటి భార్య స్థానాన్ని ఆక్రమించేసింది. తను నిర్మించుకున్న లోకం— తన సంసారం — భర్త— ఉద్యోగం యివన్నీ ఒక్కొక్కటి ఉల్కల్లా రాలిపోయి చివరికి తననుచూస్తున్న వారి కళ్లల్లో హేళన — మూలమూలలో నుండి తననుచూస్తూ గుసగుసలాడుకుంటు




న్నట్లు— ఆ గుసగుసలు హోరెత్తి తనను ముంచేస్తున్నట్లు భావనలో ఉండిపోయింది. ఆ గదిలోకి వచ్చి హేంగర్‌కున్న బట్టలు తీసుకుంటూ వాలుకంటితో పునీతను చూశాడు.

ఈ గోపాల్ తన వెంటబడి పెళ్లాడిన యితను నలుగురుబిడ్డలతండ్రి— ఆ సల్లాటి ఆకారంతో కాపురం చేశాడు. చేస్తున్నాడు. ఇతనే తనతో కాపురం చేశాడు... చేస్తాడు.

"అమ్మాయ్! అల్లుడికి యిదేం క్రొత్త కాదు. ధూ! వాడి బ్రతుకంతే-! పెళ్ళి కాకముందే మా గంగ జీవితం నాశనం చేశాడు. తప్పుకోలేక వూపిరి సలపక పెళ్లాడినాడు..." ఆ మాటలు సమ్మెట పోటుల్లా తగిలాయి అవి జ్ఞాపకం వచ్చి ఏహ్య భావంతో గోపాల్ వైపుచూసింది. పునీతలో చెలరేగే భావాలు ఏమిటో వూహించ గలడు. మిడిగుడ్లేసుకొని అసహ్యాన్ని నింపుకున్న కళ్లతో చూస్తూంటే ఒక్కడుగులో మంచం దగ్గరకు వచ్చి చెంప చెళ్లు మనిపించాడు గోపాల్. తొంగిచూస్తున్న గంగనవ్వుతూ పక్కకి తప్పుకొంది.

పునీతలో తామర తంపరగా ఎన్నో ఆలోచనలు రాసాగాయి. తనగతేమిటి? తన జీవితం ఏమిటి? గుండె బ్రద్దలవుతుంటే ఓ రోజు పెళ్ళిపోయింది. లక్ష్మీనరసమ్మ ఒడిలో తలవుంచింది పునీతతోపాటు లక్ష్మీనరసమ్మ కన్నీరు కార్చింది. అంతకంటె ఆమె మాత్రం ఏమి చేయగలదు? ఒక మనిషిలో అంతమోసం దాగి వుందా? ఆశ్చర్యంతో మునిగిపోయింది. "చేతులు కాలిపోయాయి. ఏమి పట్టుకున్నా ఏం లాభం! అతని పెంటితో వాకూ భాగముస్నట్లే. తెలియక చేసినా తప్పు తప్పే" అని వాపోయాడు బాబాయి.

ఎంతకాలమని మరొకరి యింట్లో వుండగలదు? అక్కదగ్గరకు వెళ్లి బావను పోషించ గలదా? అన్న దగ్గరకు వెళ్లి సంపాదించి పెట్టగలదా?

"భరుక్కున్నాక యిచలించక తప్పదు. నీ భర్త దగ్గరకు వెళ్లు" అని లక్ష్మీనరసమ్మ చెప్పింది.

"ఆ నరకంలోకి నేను వెళ్లలేను బాబాయ్!" అని బావురుమంది. కాలేజి నుంచి వచ్చాక తనకి సరైన భోజనం వుండదు సమయానికి తల దువ్వుకోను దువ్వెన వుండదు. ఏమి చేసినా—నీవున్నా అప్పే! రాత్రిళ్లు మాత్రం దగ్గర చేరే భర్తను ఎలాంటుం మరీ కష్టం! పిల్లికుల్ల మారుస్తూ పునీతను చూశాడు లక్ష్మీనరసమ్మభర్త. తెలిసినవాళ్ళ ప్రయత్నాలు చేసి ఆ వూరు నుంచి ట్రాన్స్ఫర్ చేయించి ఆర్డరు కాగితం పునీత చేతిలో వుంచాడు.

తన బ్రతుకు తను బ్రతుకగలదు. కాని అతన్ని ఏమి చేయాలేదు అతను చేసిన తప్పుకి, శిక్ష తను అనుభవిస్తున్నది. ఇదా న్యాయం? ఎవరిని ప్రశ్నించాలి?

యాంత్రికంగా గడచిపోతున్నాయి రోజులు. జీతం తీసుకొని కాళ్లీడ్చుకుంటూ యింటికి వచ్చింది. ప్రక్కింటావిడ నవ్వుతూ లోనికి వచ్చి బ్యాగ్‌లోన వుంచి ముసిముసిగా నవ్వుతూ "మీ యింటాయన వచ్చాడు. ఎటో వెళ్లినట్లుంది" అంది.

ఆ రాత్రి తన భర్త తనని రేప్ చేశాడని ఎవ్వరికి చెప్పుకోగలదు. వచ్చిన జీతం వచ్చినట్లే అందుకొని పోతాడు. అక్కడ పిల్లల గొడవ—భార్య పోరు తప్పించుకొని పిల్లల్ని కనని గట్టి శరీరం కావాలనుకున్నప్పుడు రావటం.

సాఫ్ రూములో ఎవ్వరూ లేనప్పుడు తనలో తాను కుమిలిపోతుండగా మంద

# మనిషి నీడ

స్వరాన ఓ కంఠస్వరం పలికింది "మిస్ పునీతా?" అంటూ,

దయనంతా నింపుకున్న కళ్ళతో చూస్తున్నాడు 'రామ్ చరణ్' ఇంగ్లీషు లెక్చరర్. తెల్లని ధోవతి – లాల్చీలో అతి నిర్మలంగా వున్నాడు. సిగ్గుపడుతూ కన్నీళ్ళు తుడుచుకుంది. వెక్కి వెక్కి ఏడుస్తున్నట్లు అంత వరకు తనకు తెలియనేలేదు

అలా వారి పరిచయం స్నేహంగా మారింది మరో స్త్రీకి చెప్పుకోలేనివి కూడా ఫ్రీగా రామ్‌గారికి చెప్పుకో గలుగుతుంది. అతని సౌహార్ద్రతతో వుపశమనం పొందుతుంది. పునీత కథ విన్నవాళ్ళు ఆమెపై దయ చూపకుండా వుండలేరు. మరొకరి దయతో తన జీవితం సుఖమయం కాగలదా ?

చెయ్యి చురుక్కున కాలింది "అబ్బా !" అంటూ చూసుకుంది అప్పటి కప్పుడే గాజుల మధ్య బొబ్బ ఎక్కింది. సిగరెట్ పొగ వదులుతూ నిల్చుని వున్నాడు గోపాల్.

"రాముని ధ్యానంలో మునిగిపోయావా?" అంటూ నవ్వుతున్నాడు. ఆ వికృతమైన నవ్వు నరనరంలోకి ప్రాకిపోయి రక్తాన్నంత కలుషితం చేసినట్లు కలిగిన బాధ ముందు కాలిన బాధ కలుగలేదు.

మణికట్టుపైని బ్యాండేజీకి కారణం రామ్ చరణ్‌కి చెప్పలేక కళ్ళు వాల్చింది. మరో మాట పలుకకుండానే గబగబ వెళ్ళిపోయాడు. దీర్ఘంగా నిట్టూర్చింది. ఒక మనిషి మనస్సు అర్థం చేసుకొని సానుభూతి చూపించగల మనస్సున్న మనిషి అతను. ఓ మంచి స్నేహానికి కూడా నోచుకోలేదా ?

* * *

ఆ రోజు సెలవు అందుకొంటూ అనుకొంది 'రేపో మాపో సర్వదా గోపాల్ చేతం ఏలుకోను. అటో యిటో తేల్చుకోవాలి గోపాల్ విషయం' అనుకొని యింటికి వచ్చింది. దీపారాధన ముగిశాక అనుకొంది. 'ఇంతవరకు గడిచిన జీవితంలో మధుర క్షణాలున్నాయా ?' అని తలుపులు వేసి మంచంపై వాలింది. హృదయపు వాకిళ్ళు తెరుచుకుని ఏవో పదిలంగ దాచుకున్న తలుపులు ఒక్కొక్కటిగా బయటికి రాసాగాయి.

ఆ రోజు సినుకగా వెళ్ళిపోయిన రామ్ చరణ్ మరలా నవ్వుతూ దగ్గరకు వచ్చాడు. సాయంత్రం.













తమ స్నేహం ఓ పాఠంలా పోసుకోలు కబుర్లవారు చర్చించుకుంటున్నారని ఎంతో తేలికగా చెప్పాలని చూసినా గొంతు బిగుసుకుపోయినట్లయింది పునీతకు. ముఖం కందిపోగా భారంగా వాల్చిన ఆ కన్నుల వైపు చూస్తూ "నీతా!" అన్నాడు. చటుక్కున తల ఎత్తింది.

"నీవు... మీరు అపార్థం చేసుకోవద్దు. మీ కిష్టమైతే మిమ్మల్ని పెళ్లి చేసుకుంటాను... మీమీద నాకు మక్కువ కలిగింది. మీ కిష్టంలేదా! ఓ స్నేహితుడిగా మిగిలిపోతాను" ఓ సమస్యను ఎప్పటినుంచో చర్చించుకొని ఓ పరిష్కారం దొరికినట్లు తేలిగ్గా చెప్పసాగాడు. "మీ అంగీకారం తెలుపండి చాలు. తక్కిన విషయాలు నేను చూసుకుంటాను" అతను పలుకుతున్నది అబద్ధంకాదని పునీతకు తెలుసు. ఆ స్వరంలో మోసంకాని తొందరపాటు కాని కనపడలేదు. అతని సమక్షంలో ఏ స్త్రీ అయినా నిర్భయంగ జీవిస్తుందన్న నమ్మకం కలుగుతున్నది.

"రామ్!" నోరారా పలికింది. "రామ్! పెళ్లి చేసుకొని మీ అంత మంచి స్నేహితుణ్ని పోగొట్టుకుంటానేమో!... రామ్! మీ పెళ్లనిచూపు — మీ స్నేహము నాకు శాశ్వతంగ పండనీయండి" అంది.

"నీలాటి, స్నేహమయి దొరకటం అపూర్వం. భార్యగా పొందటం భాగ్యం! అంత అదృష్టం అందరికీ కలుగుతుందా!.." అన్నాడు. అతని కన్నులు మిల మిల మెరిశాయి ఆ మాటలు పలుకుతున్నప్పుడు.

ఆ క్షణాలు మధురమైనవి కావా?...

తలుపు దబదబ బాదుతున్నారు. తాళి కట్టిన భర్త గోపాల్ వచ్చాడా! అతని తలంపే శరీరాన్ని వణికిస్తున్నది. అతి మెల్లిగా వెళ్లి తలుపు తీసింది. టెలిగ్రాం పట్టుకొని నిల్చునివున్నాడు పోస్టు మెసెంజరు.

టెలిగ్రాం ఎక్కడనుంచి? అక్క-అన్న బాగున్నారా? లేదా?

కీడును శంకిస్తూ సంతకం చేసి అందుకుంది. చదివిన అక్షరాలనే మరల మరలి కూడ బలుక్కుంది. ఇది నిజమా? గుండె పోటువచ్చి గోపాల్ మరణించాడా? గోపాల్ యిక లేడా? కన్నీళ్లు చెంపలమీదుగా కారుతున్నాయి. తను ఏడుస్తున్నది ఎందుకు? భర్త అనబడిన గోపాల్ చనిపోయినందుకా... ఏమో?!... ...

రిజిష్ట్రారు ఆఫీసు ముందుకువచ్చి నిలబడలేనట్లు శక్తిఅంతా ఎవరో లాక్కుపోయినట్లు కూర్చుండిపోయింది పునీత. తన ప్రక్క దృఢంగ — ఎత్తుగ నిలుచున్న రామ్ చరణ్ జబ్బపట్టుకొని లేపాడు. పునీతకళ్లకి వట వృక్షపు నీడలో విశ్రమించిన బిడువులు— పక్షులు కనిపించాయి.

'ఈ మనిషినీడలో తను పూర్తిగా మనసా వాచా కూడా విశ్రమించవచ్చు' అని తలచింది.

* * *

పెళ్లిరోజు పూలమాలలతో తాము తీయించుకున్న ఫోటో తదేకంగా చూస్తూ వుంది పునీత. ఈ రెండు నెలలలో పూర్తిగా పదిజన్మలకు సరిపడ్డ ఆనందాన్ని పొందిన అనుభూతితో మనస్సు నిండిపోయింది. పాత పరిసరాలకు దూరంగా తను నూతన దాంపత్య జీవితం ప్రారంభమైంది. పునీత యిప్పుడు పనిచేయటంలేదు. "నా భార్య పనిచేసే అవసరంలేదు. నా భార్యని-నా బిడ్డ అని నేను పోషించుకోగలను. ఉద్యోగం అవసరమున్న మరో ప్రాణి నీ వుద్యోగం అందుకోని! నీ సమయం—నీ మనస్సు నా కొరకే వినియోగించు." ఆ మాటలతో పన్నీటితో స్నానం చేసినట్లయింది. విశాలమైన హృదయంపై అంతకంటే మంచి హృదయంపై వాలిపోయింది.

(ఇంకా వుంది)



"గాలంగారు రాస్తే సులభంగా శాంక్షన్ అవుతుందని."

"నీ కవసరం వచ్చినప్పుడాయన్నాయాలీ! రాస్తోతే ఆయన వూసే నీ కక్కర్లేదూ!"

"అది ఆయన ఉద్యోగ ధర్మం."

"పోరా సన్నాసి! ఇట్లాగే మాట్లాడుతుంన్నావు. ఆయనకి మండింది. నే వెళ్ళి ఆయన్తో సద్దిచెప్పాను ఇల్లా సాధై పోతావని తెలిస్తే అమెరికా పంపకపోదును. నే చెప్తే ఆయనెంత ఇదై పోయారు.

...అసల్నేనెళ్ళక పోదునండి ఆ కాన్ఫరెంసుకు. కాని దానికి కామ్నారినుంచి సత్యన్నారాయణ రాజని మావోళ్ళబ్బాయొస్తున్నాడు.

# కొన్నారెన్నాళ్ళు అనబడే తిరునాళ్ళ కథలు

## కవన శర్మ

(గతసంచిక తరువాయి)

"ఆ అమ్మాయి రాజకుమారిని ఆ అబ్బాయి కిద్దామను కుంటున్నాం. ఆ అబ్బాయి ఇప్పటి కెన్నుత్తరాలు రాసిన తీరిక లేక మనకేసొచ్చి అమ్మాయిని చూడ్డం పడలేదు అందుకని అమ్మాయిని ఢిల్లీకి తీసుకెళ్ళి చూపిద్దామను కుంటున్నాం. ఆడోళ్ళిద్దరు వెళ్తే బావుండదు కదా! అందుకని నేను వెళ్తున్నాను. పైగా ఆ కాన్ఫరెంసులో రెండో రోజున నేను కుర్చీలో కూర్చోవాలి అని వాళ్ళు బలవంత పెడ్తున్నారు మీరూ ఆడపిల్ల తండ్రేకదా మీ క్యాబోయే అల్లుడికోసం ఎంతో మంది గాలం వేస్తుంటే మీకెల్లా ఉంటుంది. అంటూ చెప్పుకొచ్చాడు...

అద్సరేగాని గోపన్నా! యూ ఎన్నంటే ఏంట్రా? గేదెన్న ఆవెన్న ఎరుగును కాని ఈ యూఎన్న ఎరగను" అంటూ సిద్ధయ్య అగాడు.

యు. ఎన్. అంటే యునైటెడ్ నేషన్స్. అందులో ఉద్యోగంకోసం గాలంగారు గాలం వేస్తున్నారు. ఆ ఉద్యోగం వస్తే ఇన్కమ్ టాక్స్ వాళ్ళ గొడవల్లేకుండా బోల్డు జీతాలు. పిల్లలకి ఫారిన్ చదువులు. చాలా ఏళ్ళున్నాయి ఆ విషయం నీదగ్గరెత్తాడా?" అని అడిగాడు గోపాల్రావ్

"ఏదో మాటవరుస కెత్తాడులే ఢిల్లీలో దాన్సంబంధించినోళ్ళెవరో ఉన్నారని వన్లోవని అదీ చూసుకోవాలని అన్నాడు. నీది చిన్న వయస్సన్నాడు. నీకు ముందు ముందు కాన్ఫరెంసుల కెళ్ళడానికి బోలెడు టైముందన్నాడు తను అయిదేళ్ళలో రిటైరై పోతానంట. దీపం ఉండగానే ఇల్లు చక్క బెట్టుకోమని నేజెప్పా!"

"రామరాజుగారి కోసం నే కాన్ఫరెన్సు మానేసు కోవాలన్నమాట. నే వెళ్ళకపోతే ఆయన కేం బాధ?"

"నువ్వు మరీ చిన్నంతరం పెద్దంతరం లేకుండా మాట్లాడుతున్నావ్. అట్లా మాట్లాడకు. తప్పు తప్పే! ఆడపిల్లలున్నోళ్ళ బాధలు నీకు, మీ నాన్నకు తెల్సి చావవ్. రామరాజుగారు చెప్పారు. కాన్ఫరెంసుకి కాయితాలాసి నోళ్ళకి కాన్ఫరెంసోళ్ళే మార్పాయలిస్తార్ట. నీకయినా నీకీ డబ్బు కట్టక్కర్లేదంట్రా. మనకి లేదా



ఇంకోళ్లివ్వడానికి ఆయన, రామరాజుగారు నీకు డబ్బిప్పించలేక పోయినా సెలవిప్పించగలనన్నాడు అందుకే నువ్వు ఢిల్లీ ప్రయాణానికి సిద్ధపడు రిజర్వేషన్ల సంగతి నేజూసుకుంటా నీ యెంట నేనూ అమ్మాయొస్తాం''

''అక్కడ నాకు టైముండదు నేను మీకేం చూపించలేను''

''నాకు డిల్లీ కొత్తంట్రా! నేనమ్మాయికి జూపిస్తాలే కాన్ఫరెంచోళ్లకి వసతి కుత్తరం రాసి పడెయ్యి''.

## రైలు ప్రయాణం

గోపన్న, మణి, సిద్దయ్య ఢిల్లీకి ప్రయాణం కట్టారు సిద్దయ్య, మణికీ గోపన్నకు ఒక కూపే రిజర్వ్ చేయించాడు అది ఫిబ్రవరి నెల అందుచేత రైళ్లలో రష్ లేదు రిజర్వేషన్లు మరీ కష్టమవ లేదు తనకి నాలుగు బర్తుల పెట్టెలో ఒక బర్త్ రిజర్వ్ చేయించుకున్నాడు కారిడార్ టైప్ ఫస్ట్ క్లాసవటంతో సిద్దయ్య పెట్టెకి, మణి గోపన్నల పెట్టెకి ఒకటే కారిడార్ ఉంది అల్లా ఉండటం వల్ల పిల్లల్నోకంట కనిపెట్టుండటానికి పెద్దాయనకి వీలుగా ఉంది వాళ్లు చంద్రుడ్నీ, చెట్టుమీద పిట్టల్నీ చూసే సమయంలో దూరంగా తప్పుకునే వీలుకూడా ఉంది.

రైలు పది నిముషాల్లో బయల్దేరుతుందనగా, రామరాజు గాలం, రాణి గాలం, రాజకుమారి గాలం వచ్చారు గోపాల్రావ్ వాళ్లని చూసి చెయ్యూపాడు గాలం తిరగి చెయ్యూపాడు ''మీరిల్లా చేతులూపు కుంటూపోతే రైలెళ్లిపోతుంది'' అంటూ రాణి కసిరింది దాంతో గాలం స్పృహలోకి వచ్చి, మూడు అరల నిద్ర పెట్టెవైపు దారితీసాడు వాళ్ళు అందులో ఎక్కటం చూసి గోపన్న ఆశ్చర్యపోయాడు స్వంత డబ్బులు పెట్టుకుని ప్రయాణం చేస్తున్న తనే ఫస్ట్ క్లాసులో ప్రయాణం చేస్తుంటే ప్రభుత్వపు డబ్బుతో ప్రయాణం చేసే గాలం మూడో తరగతి ఎక్కటం గోపాల్రావ్‌కి పినాసితనంగా అనిపించింది

గార్డుబాబు జండా ఊపి, ఈల వేసాడు స్టేషన్‌లో గంట కొట్టారు ఇంజన్ కూత వేసింది ఉన్నట్టుండి గోపాల్రావ్ ''మణీ! నువ్వు బెర్ట్రాండ్ రసల్ రాసిన ఎ, బి, సి ఆఫ్ రెలెటివిటి చదివావా?'' అని అడిగాడు

''లేదు ఏం?''

''ఇందాక జరిగిన పనులు ఏ క్రమంలో జరిగాయన్నది, మన మధ్య ఉన్న దూరం, రైలు వేగం ప్రయాణం చేసే డైరక్షన్ బట్టి మనం నిర్ణయం చేస్తాం అవి ఇద్దరికి చెరో క్రమంలోను జరిగినట్టు అనిపించే అవకాశం ఉంది''

''లేదు''

''ఎల్లా?''

''మనిద్దరం ఒకళ్లనొకళ్లం అనుకుని కూర్చున్నాం కదా?'' అంది మణి అందులో తిరుగులేని లాజిక్ ఉంది గోపన్న ఏమనలేకపోయాడు

''అమ్మాయి రెండు చేగోడీలు పెట్టు'' అంటూ సిద్దయ్య పెట్టెలోకి వచ్చాడు టి టి ఇ ఇంకా చార్ట్ సరిజూసుకోలేదు అందుకని తలుపులు తెరిచేపెట్టారు

''రాజుగారమ్మాయి బంగారబ్బొమ్మలా ఉంది'' అన్నాడు సిద్దయ్య చేగోడీలు నములుతూ అందం ఎక్కడున్నా సిద్దయ్య పోల్చుకుంటాడు

గోపన్న ఆలోచించాడు. ఉంది అంటే మణి క్షోపం వస్తుంది లేదు అంటే అబద్ధం చెప్పినట్టవుతుంది అందుకని ''అద్సరేకాని మావయ్యా! అదేమిటాయన గాంధీగారి పెట్టెక్కాడు'' అంటూ మాట తప్పించాడు

''గాంధీగారి శిష్యుడు గాబోలు'' అందులో వింతేం ఉందన్న ధోరణిలో

''గాంధీగారి శిష్యుడు ఫస్ట్‌క్లాస్ ఖర్చులు గవర్నమెంటు నుంచి రాబట్టున్నాడు.''

''అందులో తప్పేముంది దానికి ఆయన అర్హుడు''

''అందులో ఆదా చెయ్యటం తప్పుకాదా?''

'ఆదా చెయ్యటం లేదుకదా! ఒక ఫస్టుక్లాసు టికెట్టెడ్తేగాని మూడు థర్డు క్లాసు టిక్కెట్లు రావు''

''ప్రభుత్వం తనకోసం ఇచ్చిన డబ్బు కుటుంబం మీద ఖర్చు పెట్టడం తప్పు''

''అయితే నువ్వు నీ జీతం మణి మీద ఖర్చు చెయ్యటం తప్పు పెళ్లాం పిల్లల మీద ఖర్చు చెయ్యటానికేకదా గవర్మెంటు మీలాంటోళ్లకి డబ్బిచ్చేది అయినా నువ్వేకదా చెప్పావ్ మీ అమెరికాలో పెళ్లాన్ని పిలవకుండా మొగడ్నెక్కడికి పిలవరని అంటే అర్ధం ఏంటి? అందాక ఎందుకు అర్ధాంగి, ఆత్మజ అంటే అరం ఏంటి?''

గోపన్న జవాబు చెప్పలేదు రైలు చెట్టూ చామలు దాటి రాళ్ల భూమిలోంచి పరుగెడుతోంది.

పుచ్చపువ్వులాంటి వెన్నెల జీరోవాట్ బల్బ్ కాంతిలాగా మెత్తగా అందంగా ఉంది టి టి. ఇ వచ్చెళ్లాడు. మణి ఆవలించింది సిగ్గులందుకుని సిద్దయ్య లేచాడు తలుపు గట్టిగా వేసొచ్చి అంతకన్నా గట్టిగా ''గోపీ'' అంటూ మొగుడిని వాటేసుకుంది మణి

* * *

తెల్లారింది ఏదో పెద్ద ఊరొచ్చింది. సిద్దయ్య లేచి కాఫీ తాగటానికి హడావిడి పడటం మొదలు పెట్టాడు అయినవాడిని కానివాడిని ''కాఫీ హై?'' అని అడిగాడు వాళ్ళ ''నై'' అన్నారు సిద్దయ్య రైల్దిగి కాఫీ విషయం కనుక్కోడానికి వెళ్లాడు సిద్దయ్యకు హిందీ రాదు ఇంతలో స్టేషన్ కటకటాలవతలి నుంచి ''బడ్డాగాడు ఢిల్లీ పోతున్నాడు.'' అని ఒకడన్నాడు

''ఈ అన్యాయాల్ని అరికట్టాలి'' అన్నాడు మరొకడు

తెలుగు వినగానే సిద్దయ్య మొహం కళ కళలాడింది వాళ్లదగ్గరకి వెళ్లి ''బాబ్బాబు ఇక్కడెక్కడైనా కాఫీనీళ్లు దొరుకుతాయా?'' అని అడిగాడు.

''మా గొడవల్లో పడి మే మేడుస్తూ ఉంటే మధ్యలో కాఫీ అంటూ ఊదరగొడ్తావేమిటయ్యా?'' అని వాళ్ళు జంటగా విసుక్కున్నారు

''మీ గొడవలా? అవేంటి?'' అని సిద్దయ్య కుతూహలంగా అడిగాడు

''మీ రార్చేవారా? తీర్చేవారా?''

''అవేవి చెయ్యలేకపోవచ్చు కాని కత్రలాసే వోడోడు మా ఊరోడే ఉన్నాడు ఆడ్తో చెప్పి మీ గోడు నలుగురికి వినపడేలా చేస్తా. మీ విరో

దుల్ని ఏకం చేస్తా పార్లమెంటులో ప్రశ్నలడిగిస్తా" అంటూ సిద్దయ్య తన శక్తి సామర్ధ్యాల గురించి పలుకుబడి గురించి చెప్పాడు

ఒకడు మరొకడు మొహా మొహాల్చూసు కున్నారు సిద్దయ్య చెరో చెవిలో చెరో సగం కథ చెప్పారు ఇంతలో సిగ్నలిచ్చి గంట కొట్టారు సిద్దయ్య కాఫీ మాట మర్చిపోయి పరిగెత్తుకుంటూ వచ్చి రైలెక్కాడు రైలు బయల్దేరబోతోంది సిద్దయ్య కిందాక ఒకడు చూపించిన బడ్డా అతని లడ్డూ లాంటి భార్య తన పెట్టెలో కనిపించారు మరొకడు చూపించిన పెద్దమనిషి కిటికి దగ్గర నిలబడి "నే రేప్పొద్దున్న బయల్దేరి రానా ?" అని రైల్లోని లావుపాటి పెద్దమనిషిని అడుగుతున్నాడు

"వద్దమ్మా గవర్నమెంటసలే ఖర్చుల్లో ఉంది ఈ యేడు మనం కొంచెం పొదుపుగా ఉండాలి" అన్నాడు లోపలివాడు ఇవి వాళ్లిద్దరు ఇంగ్లీషులో మాట్లాడుకోటంచేత సిద్దయ్యకి చూచాయగా అర్ధమయ్యాయి

అప్పుడే దంపతుల పెట్టిలో నిద్రలేచిన గోపన్న కిటికీలు తెరిచాడు అతనికి పక్క కిటికి దగ్గర ప్లాట్‌ఫామ్ మీద నిలబడ్డ పెద్దమనిషి "నేను వస్తాను" అంటూ తల్లివెంటపడే చిన్నపిల్లాడిలాగా రైలువెంట పడటం కనిపించింది

"వద్దమ్మా ! నీకు ఢిల్లీ నుంచి మంచి పేరు తెస్తాను" అంటూ లోపలున్న భారీ మనిషి తల్లి పిల్లాడిని బుజ్జగించినట్టు బుజ్జగించటం వినిపించింది ఆ మనిషి భారీగా ఉంటాడన్న విషయం గోపన్నకి కొంత ఆలస్యంగా తెలిసింది

రైలు వేగం అందుకుంది సిద్దయ్య "హియర్. కాఫీ వేర్ గెటింగ్ ?" అంటూ ఆ దంపతుల్ని ప్రశ్నించాడు అందులో ఆడ శాల్తి బడబడా ఏదో చెప్పింది సిద్దయ్యకి అర్ధం కాలేదు. బహుశ ఆవిడ హిందీలో జవాబు చెప్పుంటుంది అనుకున్నాడు ఇంతలో గోపన్న బాత్‌రూమ్ నుంచి వస్తూ కనిపించాడు

"గోపన్నా" అంటూ సిద్దయ్య పిల్చాడు అల్లుడిని దంపతులకి పరిచయం చెయ్యబోయి చేత కాక ఊరుకున్నాడు.

గోపన్న "అయామ్ డాక్టర్ గోపాల్రావ్ ఆఫ్..." అంటూ పరిచయం చేసుకున్నాడు.

"అయామ్ డాకటర్ మూ ధేశ్వర్" అంటూ లావాటతను చెయ్యి చెయ్యి జాచాడు

"మీ గురించి విన్నాను మీ తండ్రిగారు కేంద్రంలో మంత్రి కదా !"

"అవును" అన్నాడు మూధేశ్వర్ వినయంగా "ఈవిడ మా ఆవిడ" అంటూ భార్యను పరిచయం

## కాన్ఫరెన్సుల తిరునాళ్ళు

చేసాడు "పేకాడ్దామా . నేను అమెరికాలో ఉన్నప్పుడు పోకరాడ్టంలో నన్ను మించిన ఇండియన్ ఉండేవాడు కాదు" అంటూ వినయంగా చెప్పు కున్నాడు

"అమెరికాలో కూడా మీ గురించి విన్నాను ఇప్పుడెక్కడికి వెళ్తున్నారు ?"

"ఢిల్లీలో కానఫరెన్సుకి మీరో ?"

"నేను అక్కడికే"

"ఈయన . ?"

"మా మావయ్య"

సరిగ్గా ఆ సమయంలో సిద్దయ్య "ఒరే గోపన్నా ! ఆయన్ని కాఫీ విషయం అడగరా" అంటూ సణగటం మొదలుపెట్టాడు గోపన్న మూధేశ్వర్‌ని అడిగాడు వచ్చే స్టేషన్‌లో కాఫీ దొరుకుతుందని, దొరకకపోతే స్టేషన్ మాస్టరు ఇంటికి వెళ్లి చేయించి పట్టుకొస్తాడని అంతవరకు రైలాగుతుందని, ఆ ఊర్నించే తన తండ్రి పార్లమెంటుకి ఎన్నికైనాడని వినయంగా చెప్పుకున్నాడు.

"మీకు చాలా శ్రమిస్తున్నాను."

"శ్రమేంలేదు"

గోపన్న లేచి తన పెట్టెవైపు కదిలాడు

---

## డాక్టర్ సలహాలు —డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

బి ఎస్ ఎన్ ఎమ్ — వైజాగ్

నాకు 3 సం ల నుండి ఆకలి వుండుటలేదు 'రౌండు వర్మ్స్'కి మందు వాడాను నాకు కడుపు నొప్పి గాని, మంటగాని లేవు

★ కడుపు నెప్పిగాని, ఇతర లక్షణాలుగాని లేనప్పుడు "రౌండ్‌వర్మ్స్"కి మందులు వాడవలసిన అవసరమేమున్నది ? ఆకలి లేకపోవటం అనేది ఎన్నో కారణాలవల్ల జరుగవచ్చును మల పరీక్ష చేయించుకొని, దాని ఫలితాన్ని బట్టి, మందులు వాడటం, ఆహార విధానంలో మార్పులు చేయటం — అంటే నిర్ణీత సమయంలో ఆహారం తీసుకోవటం, భోజనం చేసేముందు, చిరు తిళ్లు మానటం, ఎక్కువ కాఫీ, టీ మొదలయినవాటిని తీసుకోకపోవటం మొదలయినవి — చాలా ముఖ్యం .

ఇలా చేయక, వివిధ రకాలైన 'టానిక్'లు వాడటంవల్ల ఫలితంలేదు

ఎస్ పి — గుంటూరు

నా వయస్సు 20 సం లు. 2 నెలల క్రిందట జలుబుచేసి తగ్గిపోయినది కాని అప్పటినుండి జలుబు చేసినట్లే వుంటుంది తుమ్ములు కూడా ఎక్కువగా వస్తూవుంటాయి తుమ్ములు వచ్చినప్పుడల్లా 5, 6 తుమ్ములు వస్తాయి నేనేమి మందులు వాడలేదు.

★ తుమ్ములు తరచూ వస్తున్నప్పుడు 'అలర్జి' అనే దానివలననే అని నిర్ధారణగా చెప్పవచ్చును 'అవిల్' మాత్రలు, రోజుకి ఒక మాత్ర వంతున వరుసగా 5 రోజులు, దానితో బాటుగా విటమిన్ 'సి' — 500 మి గ్రా మాత్రలు రోజుకి ఒకటి వంతున, దాదాపు నెలరోజులపాటు వాడవలసి వుంటుంది. 'రెడాక్సాన్' 'సిట్రవైట్', 'సెలిన్' మొదలయినవి "విటమిన్ - సి" — ని కలిగి వుంటాయి

ఎల్ జి - తాటిపాక

మా నాన్నగారికి గృహ సంబంధమయిన వ్యవహారాలవల్ల మనస్సు పాడయి పోయింది ఇప్పుడు కొద్దిగా అతిగా మాట్లాడుతున్నారు దానిని ఆదిలోనే అంతం చేయుటకు ఎలాంటి ట్రీట్‌మెంట్ చేయించాలో తెలియపరచండి

★ కొన్ని, బాధ కలిగించే విషయాలు, ఒకదానివెంట ఒకటి, మనిషి మీద, విపరీతమయిన పరిమాణాన్ని కలుగచేస్తాయి ఎంతో గుండె నిబ్బరంగా ఉంటే తప్ప, ఇవి మనిషికి విపరీతమయిన మానసిక ఆందోళన కలుగజేస్తాయి

దీనిని నివారించటానికి, ఆ మనిషికి చోటుమార్పు చాలా అవసరం "సైకియాట్రిస్టు" ల సలహామీద, తగిన మందులు వాడితే తప్పకుండా నయమవుతుంది కానీ, తిరిగి, అవే పరిస్థితులు అతనిమీద పనిచేయకుండా చూడటం ముఖ్యం.

కె ఎస్ — విడవలూరు

నా వయస్సు 23 సం లు నాకు క్రింద పలువరసలో అదనంగా ఇంకొక వరుస ఏర్పడింది. ఇలా 7 సం లుగా వున్నది. ఇద్దరు వైద్యులను (దంత) సంప్రదించగా, యిద్దరు రెండు విధాలుగా చెప్పారు...

★ దంత శాస్త్రంలో నిపుణులైన వైద్యుల సలహాను మించి నేను చెప్పగలిగింది ఏమీ లేదు.

మీకు బాగా నమ్మకము వున్నవారి దగ్గర చూపించి వారు చెప్పినట్లు వైద్యం — పళ్లు పీకించటం — క్లిప్పు వాడటం — చేయించుకోండి.

కె కె—వాల్తేరు

నాకు నత్తివున్నది ఎన్నో మందులు వాడినాను ఫలితము లేకపోయింది ఏదైనా మార్గము వ్రాయండి

★ 'నత్తి' ఉన్నవారికి — 'స్పీచ్ థెరపిస్టుల' ద్వారా చక్కని ఫలితాలు లభిస్తాయి ఈ స్పీచ్ థెరపిస్టులు సాధారణంగా న్యూరాలజీ డిపార్టుమెంట్లలో పనిచేస్తారు (జనరల్ హాస్పిటల్స్‌లో) వీరి సహాయంవల్ల క్రమ క్రమంగా మామూలుగా మాట్లాడగలిగే శక్తి ఏర్పడుతుంది

మందులుమాత్రం వాడటంవల్ల పెద్దగా ఫలితం ఉండదు

ఆర్ ఎస్ — రామగుండం

నాకు ఋతుక్రమం సరిగా రావటం లేదు. ఇక్కడ ప్రక్కన వున్నవారు చెప్పగా కొన్ని మందులు వాడాను కాని ఫలితంలేదు దీనికి యేదైనా మందు చెప్పండి.

★ ఋతుక్రమం సరిగా రానప్పుడు లేడీ డాక్టర్ల వద్ద తగిన పరీక్షలు చేయించుకొని, మందులు వాడితే మంచిదిగాని, ప్రక్కన వున్నవారు చెప్పినది విని మందులు వాడితే ఇలాగే జరుగుతుంది వారికి వున్న రోగానికి వైద్యులు మందులు వాడివుంటారు కాని అన్నిరోగాలు అందరికీ వుండవుగా ! మీరు దగ్గరలో వున్న వైద్యులకు చూపించుకొని మందులు వాడాలి 'అనీమియా' వుండటంవల్ల కొందరికి ఋతుక్రమంసరిగా రాకపోవచ్చును ●

సిద్దయ్య వెనకాతలే బయల్దేరాడు. మాటల్లో గోపన్న "ఆయన చాలా మంచివాడులా ఉన్నాడు" అన్నాడు

"ఇతడి కత తెలిస్తే అల్లా అనవ్"

"నీకు తెలుసా ?"

"తెలుసు"

"అయితే చెప్పు."

"తెల్లారిందీ కథలకి" అంటూ మణి విసుక్కుంది

"నీకు బోరుకొడుతుందనే ఢిల్లీ రావద్దన్నాను పత్రికలలో ఇల్లాంటి కథలొస్తే పేజీల్తిప్పేస్తావు కదా! అల్లాగే మావయ్య కథ మొదలుపెట్టగానే పై బర్తెక్కి నిద్రపో" అని తెలుగులో అని ఆపైన ఇంగ్లీషులో "పాపం అసలే రాత్రంతా నిద్దరలేదు" అన్నాడు అమెరికన్ యాసతో మణి బుగ్గలు ఎరుపెక్కగా మణి పై బర్తెక్కింది

'చెప్పు మావయ్యా!' అన్నాడు గోపన్న సిద్దయ్య మణి కేసి క్షమించమన్నట్టుగా చూసి కథందుకున్నాడు

## తక్కువ పేర్లూ ఎక్కువ సుఖం కథ

ఇందా కెళ్లిపోయిందే ఆ ఊళ్లో ఓ గవర్మెంటు లాబ్రెటీ ఉంది అందులో వ్రెటి వెంగన్నరావు బి సైంటిస్టుగా ఉన్నాడు అతనెక్కడుంటే అక్కడి వాళ్లతన్ని వెటికుట్టె కింద కట్టె మోసం చేస్తూ ఉంటారు అదే లాబ్రెటీలో పి వి రావు అని మరో తెలుగోడున్నాడు అందుకని స్నేహితులతన్ని పండిత వీరభద్రరావు అంటారు కాని అతనికి ప్రపంచ గ్నానం నాకున్నదాంట్లో వెయ్యోవంతు లేదు అందుకని అతని పిచ్చి వీరబద్రరావు అనికూడా అంటారు స్నేహితులు ఇతడు సైంటిస్టు ఎ. మనం ఏదైనా గొప్పగా ఉందని చెప్పడానికి ఎ క్లాసని, రెండో రకాన్ని బి క్లాసని అంటామా అదేంటో గోపన్నా ఈ సైంటిసిక్కోళ్లన్ని తల్లకిందులే! అంటూ కథాపాడు సిద్దయ్య

"అదికాదు మావయ్యా! పైకి పోయినకొద్దీ సామర్ధ్యం క్షీణిస్తుందని ఒక సూత్రం ఉంది అంటే సమర్థులు అన్నిచోట్లా కింది తరగతుల్లోనే ఉంటారన్నమాట సైంటిస్టులలోను అంతే! అందుకని వాళ్లని ఎ సైంటిస్టులు అంటారు ఉద్యోగంలో పైకి పోయినకొద్దీ సైంటిస్టుల సామర్ధ్యం తగ్గుతుంది అందుకని వాళ్లకి డి, ఇ, ఎఫ్ అంటూ నామకరణం చేసారు" అంటూ సిద్దయ్యకి గోపన్న వివరించారు సిద్దయ్యకి అర్ధం కాలేదు కాని అర్ధమైనట్టు పోజు పెట్టి కథందుకున్నాడు.

ఇంతకు గవర్మెంటోళ్లు ఓ రోజున మా లాబ్రెటీలో ఇదిగో ఈ విషయం మీద పరిశోధనలు చెయ్యండంటూ ఉత్తరం రాసారు దానికి జవాబుగా ఈ మూడేశ్వర్ "దానికి మాకు ఏ సంబంధం లేదు అది మరో లాబ్రెటీ చెయ్యాల్సిన పని" అంటూ జవాబు రాసాడు అయితే ఇందిరాగాంధి పవర్‌లో కొచ్చాక అందరి తిక్క కుదురుస్తోంది అందుకని పైనుంచి వాళ్ల బాబు కల్పించుకోబోయినా వీలవ లేదు కాయితం "ఇది మీదే!" అంటూ తిరిగొచ్చింది

అప్పుడు మూడేశ్వర్ "నేను పాలనకి సంబంధించినోడిని పరిశోదనకి సంబంధించినోడిని కాను. నువు జూస్కో" అంటూ తనకింద ఉన్న ఒక సి సైంటిస్టు కిచ్చాడు ఆడ్నాదికాదు బొమ్మన్నాడు. మరోడి కిచ్చాడు ఆడూ ఇదే దోరణి "పంట లేసుకోండి" అన్నాడు ఆళ్లొప్పకోలా మూడేశ్వర్ గ్నోపం వచ్చింది "కోడి—కొంగ" ఆడి తేల్చాడు దానికీ వాళ్లొప్పకోలా చివర్నారిగా చీట్లేసాడు అందులో బెనర్జి పేరుంది

ఆ మర్నాడెదా ప్రకారం లాబ్రెటీ కాలస్యంగా వచ్చిన బెనర్జి బల్లకి తల ఆన్చి నిద్దర మొదలు పెట్టాడు అయితే రోజూలా నిద్దర పట్టలా కణతలొత్తుక్కుకున్నాడు అయినా పట్టలా

ఆ సమయంలో ఏదో అడగటానికి వి వి రావ్ ఆ గదిలో కొచ్చాడు మామూలుగా అయితే బెనర్జి తన నిద్దరతగాడు పాడ్చేసినందుకుగాను అగ్గి బుగ్గవును కాని ఆ రోజు అతనికి వి వి రావ్ మీద, అభిమానం పొంగుకొచ్చింది. "చూ(డావూ! నాకు నీమీద బోలుడు నమ్మకం ఉంది ఒకే లాబ్రెటీలో పన్జేస్తున్న మనం అన్నదమ్ముల్లాంటోళ్లం ఈ కాయితం గవర్మెంట్నుంచి నా జేతి కొచ్చింది అందులో ఉన్న విషయం నా కంతుపట్టినా దాన్నంతు తేల్చటం నాకు రాదు వచ్చేమోగాని సి సైంటిస్టుగా మారినప్పటినుంచి ఏదీ గ్నాపకం ఉండి చావడం లేదు ఈ కాయితంలో ఉన్న విషయం గురించి నా దగ్గర రెండు పుస్తకాలున్నాయి ఇవి రష్యా వెళ్లినప్పుడ్దెచ్చా అవోసారి చదువు" అంటూ ఆ కాయితాన్ని ఓ రెండు పుస్తకాల్ని వి వి రావుకి అంటగట్టాడు వి. వి రావ్ అవి పుచ్చుకుని బయట కెళ్లాడో లేదో బెనర్జికి ఆవలింత వచ్చింది కళ్లు మూసుకుపోయాయి

వి వి రావు చచ్చీ చెడీ రాత్రింబగళ్లు ఆ పుస్తకాలు చదివి, అవి చెత్తని తేల్చుకుని, సరైన పుస్తకాలు లైబ్రెరీలో వెతికి పట్టుకుని, ఆ విషయం గురించి చదివి జీర్ణించుకుని పరిశోధన మొదలెట్టాడు అది పెద్ద సముద్రంలా కనిపించింది అప్పుడతను బెనర్జి దగ్గర కెళ్లి "మీకు రెండ్జేతులున్నాయి కదా! అందులో ఒకటి సంతకాలు పెట్టడాని కుంచేసుకుని రెండోదాన్తో నాకు సహాయం చెయ్యండి" అంటూ కోరాడు

"నాక్కీరుబడి లేదు ఆ పి వి రావు అదే కొత్తగా చేరినతను, ఏ గోరునీ బెరగనీయకుండా మొదట్లోనే గిల్లేస్తున్నాడు అతగాడికి పన్నెండుట అతన్నడుగు ముఖ్యమైన విషయాల్లో దప్పు, ఇటువంటి చిన్న చిన్న విషయాలకు నా దగ్గరకొచ్చి నన్ను డిస్టర్బ్ చెయ్యకు" అంటూ వి వి రావును పంపించేసి, నిద్రలో పడ్డాడు

వి వి రావు, పి వి. రావుని సహాయం కోరాడు. పి వి రావు ఎగిరి గంతేసాడు కొద్ది రోజుల్లోనే, పి వి రావు గోళ్లు మూడ ముచ్చటగా పెరిగాయి ఎట్టాగైతేనేం ప్రాజెక్టు పూర్తయింది రిపోర్టు రాసారు అది గవర్మెంటు కెళ్లింది. అంతవరకు సమస్యేం రాలేదు

ఆ రిపోర్టుని కాన్ఫరెంచులో చదువుతామని దానికి అనుమతి కావాలని వి వి రావు మూడేశ్వర్ ద్వారా అర్జీ పెట్టుకున్నాడు గవర్మెంట్సరేనంది. అక్కడే సమస్య వచ్చింది.

వి వి రావు ఆ రిపోర్టును పేపరు రూపంలో రాసి తన పేరు ముందు, పి వి రావు పేరు తరువాత పెట్టి బెనర్జి చేతికిచ్చి కాన్ఫరెంచుకి పంపమన్నాడు అద్జూసి బెనర్జి "ఇదేం బాగాలేదు" అని, వి వి రావు పేరుకు ముందు తన పేరు కలిపి ఇప్పుడు బావుంది అన్నాడు వి వి రావు ఏమీ అనలేక ఊరుకున్నాడు.

"బెనర్జి, వి వి రావ్ మరియు పి వి రావు చచ ఇద్నాలా పొడుగ్గా ఉంది బీహార్‌లో మంత్రి వర్గంలా ఉంది" అనుకున్నాడు బెనర్జి, వి వి రావు వెళ్లిపోయిన కొంతసేపటికి. అందుకని తోక కత్తిరించి బెనర్జి మరియు వి. వి రావ్ అని మార్చాడు "ఇప్పుడు బావుంది" అనుకున్నాడు. ఆ విషయం వి వి. రావ్‌కి కబురెట్టి చెప్పాడు

"పి. వి రావ్ పేరెందుకు తీసేసారు ?" అని అడిగాడు వి వి రావు

"పి వి రావు నీకు సహాయం చేసాడు. అంతే కదా! అట్టా అయితే లాబ్రెటీలో ఉన్న టెక్నీషియన్లు, హెల్పర్లు అందరూ నీకు సహాయం చేసారు వాళ్ల పేర్లు కూడా పెట్టాలి"

"అయితే మీ పేరెందుకు?" అని వి వి రావు కోపంగా అడిగాడు

"ఆ ప్రాజెక్టు నీకిచ్చింది నేను నేను మరొకరి కిచ్చుంటే, పైగా నీకు పుస్తకాలిచ్చింది నేను" అంటూ ఈ మాత్రం తెలియదా అన్న ధోరణిలో కసిరాడు

[ఇంకా ఉంది]

# ప్రశ్నావళి

కె. రామలక్ష్మి

**టి టి ఆర్ అనపర్తి.**

స్నేహం చిరకాలం నిలవాలంటే ?

ఎదుటి వారికి అడ్డమైన చాకిరీ చేస్తే స్నేహం కలకాలం ఉంటుందనుకుంటారు కొందరు ఎదుటి వారి అభిప్రాయాలు తు చ తప్పక తలూపుతూంటేనే స్నేహితులుగా ఉండగలరనుకుంటారు కొందరు ఇదీకాదు అదీకాదు 'వారేవీరు వీరేవారు' అనేలా అయిపోతే స్నేహితులంటారు కొందరు. నా దృష్టిలో ఇవేవీ స్నేహాన్ని కలకాలం నిలపవు సరికదా — మొహం మొత్తిస్తాయి ! 'జిడ్డులా పట్టుకున్నాడ'ని కొందరనుకుంటే 'ఏమిటీ తలాడించే బొమ్మ' అని కొందరనుకుంటారు 'మాకు మమ్మల్ని వో క్షణం ఉండనివ్వరేం కర్మ !' అనుకుంటారు అందుకే మన విలువ తగ్గించుకోకుండా, మన వ్యక్తిత్వానికి భంగం రాని విధంగా ఎదుటి వారితో ప్రవర్తిస్తే—వారే స్నేహితులవుతారు గౌరవం యిచ్చి గౌరవం తెచ్చుకోవాలి అలాగే స్నేహం

మీ జవాబులు చదువుతూంటే మీరు గయ్యాళేమోనని నాకు అనుమానంగా ఉంది ?

ఏం బి సీ నాటి మనిషివయ్యా ! ఇంకా అనుమానమేనా ! ఖాయంగా—నేను పరమ గయ్యాళినే కావలిస్తే నా స్నేహితుల నెవర్ని కావలిస్తే వాళ్ళనడుగు

**ఎల్. కె హెచ్. ఆమనగల్లు**

ఇంటికి దీపం యిల్లాలు- ఇది ఎంతవరకు నిజమో సెలవిస్తారా ?

శుద్ధ అబద్ధం అది ఇల్లాలే దీపం అయితే — యీ ఎలక్ట్రిసిటీ బిల్లు లెందుకు ? కిరసనాయిలు క్యూలెందుకు ? !

**హిమబిందు కొత్తగూడెం.**

ఆడపిల్లలు అత్తవారింటికి వెళ్లి కాపురం చేస్తున్నట్టు పురుషులు అత్తవారింటికెళ్లి కాపురం చేసే రోజులు వస్తాయంటారా ?

రావచ్చు—కట్నం రేట్లతోపాటు— యీ కండిషన్ కూడా పెడితేసరి ! మంచి కట్నం వదులుకోగలరా అబ్బాయిలు ! వారి తల్లితండ్రులు ! !

**కె. ఆర్ జె. ఆదోని**

మీకు పిచ్చిపిచ్చి ప్రశ్నలు వేస్తూ వుంటారే— వాళ్లను గురించి మీ ఉద్దేశ్యం ?

నేను వాళ్లకు మించిన పిచ్చిదాన్ని కదా ! అంచేత ఏమీ అనుకోను.

**బి హెచ్. ఎస్. ఆర్. హైద్రాబాదు.**

డబ్బు విలువ తెలియని వాళ్లకి ఎలా తెలియ చెప్పాలి ?

డబ్బు విలువ తెలుసుకోవాలంటే : సంపాదించనైనా సంపాదించాలి ! అప్పనయినా పుట్టించాలి

**పి. ఎల్. కె జగిత్యాల.**

వరకట్నం చట్ట విరుద్ధమా ? అయితే ప్రభుత్వం ఎందుకు శిక్షించదు ?

బాగుంది ? కట్నం యిచ్చిన వాళ్లో పుచ్చుకున్న వాళ్లో నేరారోపణ చేస్తే కద ? !

**కె. ఎమ్ ఆర్. బ్రాహ్మణపల్లి.**

శాంతి నికేతన్‌లోని విద్యావిధానాలు తెలుపండి

ఈ కార్డు ముక్క అక్కడికే రాసివుంటే – వాళ్ల కోర్సులు సిలబస్సులుకూడా పంపేవారు బ్రదర్!

ఇప్పుడు మీకు కావలసినది ధనమా ? ధాన్యమా ?

రెండూ కాదు రేషనుకార్డు !

**ఎస్ ఎస్. విశాఖపట్నం**

విభిన్న దృక్పథాలు కల స్నేహితులు స్నేహంగా ఉండగలరా ?

వాళ్లే మంచి స్నేహితులు అవుతారు మూసపోసినట్టు ఇద్దరిదీ ఒకటే దృక్పథం ఒకటే హాబీ అయితే—ఒకళ్ల నొకళ్లు బోరు కొట్టి చంపుతారు

# చేతిలో వేసిన చేయి కలకాలం విడిపోకుండా నిలిపే పరిమళం



## ఫరెవ్వార్ పెర్‌ఫ్యూమ్

ఎంతోకాలం నిలిచే పరిమళాలకు
ఇప్పుడు సులభంగా దొరుకుతోంది.




రాబోయే ఉత్తేజకరమైన సన్నివేశాలను గుర్తుచేసే పరిమళం ఆ పరిమళంలో కలలు నిజమైన అనుభూతి ఇంద్రజాలమనిపించే పరిమళం

మనసు మైమరిపించే పరిమళానికి మరో పేరు ఫరెవ్వార్ పెర్‌ఫ్యూమ్

ఫరెవ్వార్ పెర్‌ఫ్యూమ్ కేవలం పెర్‌ఫ్యూమ్‌కు పేరు మాత్రమే కాదు మీకు ఇది నిజంగా అపూర్వమైన అనుభవాన్ని ఇస్తుంది ఇది మీలాగే ఎంతో సహజమైన తాజాదనాలు చిందిస్తుంది

ఫరెవ్వార్ పెర్‌ఫ్యూమ్ పరిమళ ద్రవ్యాలను తయారు చేయడంలో పేరెన్నికగన్న పారిస్ దేశపు విజ్ఞానంతో రూపొందించబడినది

మిమ్మల్ని ఎల్లప్పుడూ మనోహరంగా రంజింపచేసేందుకే!



## "రక్త సంబంధాలు"

ఈ పేరు గొప్ప చిత్రం ఒకప్పుడు పెద్ద హిట్ అయిన నిజం అందరికీ తెలిసినదే

నవ చిత్ర ఎంటర్ ప్రైజెస్ రంగులలో రమణీయంగా రూపొందిస్తున్న చిత్రానికి "రక్త సంబంధాలు" పేరును యిడినట్టు, దర్శకుడు మల్లికార్జునరావు చెప్పారు ఈ చిత్రానికి మహారథి మాటల రచయిత అవడంచేత, మధురిమ గురించి వేరే వ్రాయాలా? మధుర మనోహరంగా మాటలను పలికించగల ప్రతిభ మహారథికి వున్నదని నిరూపించే మరో చిత్రమే "రక్త సంబంధాలు"

మంచిని పెంచే వ్యక్తిగా, వంచనను త్రుంచే మనిషిగా, మనసు — మమత వున్న వుత్తముడిగా,

"రక్త సంబంధాలు"లో ఒక దృశ్యం

ద్రోహాలను తుదముట్టించే కార్యశూరుడుగా కృష్ణ గొప్పగా నటించిన విజాన్ని రషస్ చూసిన వారందరూ చెప్పారు సత్యం సంగీతం గూర్చి, స్వామి ఛాయాగ్రహణం గూర్చి విశేషంగా చెప్పారు

చిత్రం గజిబిజి లేకుండా, హృదయాలను ఆకట్టుకునే విధంగా మల్లికార్జునరావు కృషి కనిపించినట్టు చెప్పారు పాత్రధారులలో అంజలీదేవి, సత్యనారాయణ, చంద్రమోహన్, లత, గిరిబాబు చక్కగా చేశారట గ్లామర్ భాగాన్ని మంజుల భర్తీ చేసిందట

ప్రతి హృదయానికి "రక్త సంబంధాలు" చిత్రం ఏదో అనుభూతిని కలిగించగలదు

## ఆశ్చర్యం !

శ్రీ గౌతమ్ పిక్చర్స్ నిర్మించే చిత్రాలలో రామారావుగారు తప్ప మరొకరు కథానాయకుడి పాత్రను పోషించగలరన్న అభిప్రాయం ప్రజలకు, పరిశ్రమకు వున్నది

"నటరత్న" లేకుండా సినిమాతీసే ఉద్దేశ్యం రామబ్రహ్మంగారికి లేదన్న నిజం అనేకసార్లు ఆయన నోటంట విన్నాను

మరి, యీసారి నిర్మితమయ్యే చిత్రంలో రామారావుగారు లేరని తెలిసి ఆశ్చర్యపడ్డాను

కావలిపాటి విజయలక్ష్మి రాసిన "అపశ్రుతులు" కథకు డి వి నరసరాజు సినిమా అనువాదం, మాటలను సమకూర్చినట్టు నిర్మాత చెప్పారు

సత్యనారాయణ ముఖ్య నటుడుగా శ్రీ గౌతమ్ పిక్చర్స్ నిర్మించే చిత్రానికి సత్యం సంగీతసారథి డి యోగానంద్ దర్శకుడు వెంకటరత్నం నిర్వాహకుడు



"అన్నదమ్ముల కథ"లో సుజాత, బాలయ్య

## మంజుల రెండు వేషాలు

మంజుల మంచి నటి అని "మంచిమనుషులు" చిత్రం నిరూపించింది

ప్రస్తుతం మంజుల పది చిత్రాలలో నాయికగా నటిస్తున్నది ఎక్కువ చిత్రాలలో శోభన్‌బాబు జతగాడు 'నటరత్న'తో ఒకటి, కృష్ణతో రెండు వున్నాయి మంజులకు సుహర్దశను, మహానటి అనెడి పేరును తేగల పాత్రలను విఖ్యాత దర్శకుడు ఆదుర్తి సృష్టించారు రవి కళా మందిర్ నిర్మించే "బజారు బిడ్డలు" చిత్రంలో తను రెండు విశిష్టమైన పాత్రలను పోషిస్తున్నట్టు ఆవిడే చెప్పింది

కవలపిల్లలట ఒకటి మగవేషం మరొకటి ఆడవేషం ఆడ, మగ రెండింటినీ తనే ధరిస్తుందట!

"బజారు బిడ్డలు" చిత్రానికి ఆదుర్తి కథకుడు, సినిమా అనువాదకుడు మరియు దర్శకుడు

## "గాజుల కిష్టయ్య"

ఆదుర్తి దర్శకత్వంలో రూపొందించబడిన రమణీయ రంగుల చిత్రం "గాజుల కిష్టయ్య" విడుదలయితే, కృష్ణకు వుజ్వల దశ పున ప్రారంభమవుతుంది ఈ చిత్రంలో కృష్ణ నటన చాలా బాగున్నట్టు, మాస్‌ను ఆకట్టుకునే విధంగా ఆయన నటించినట్టు తెలిసింది

ఒక గ్లామర్ నాయికను అనగా జరీనాను వెండి తెరకు పరిచయం చేస్తున్నారు, ఆదుర్తి చక్కదనాల జాణ అంటున్నారు, ఆవిడ అభినయాన్ని చూచిన వాళ్ళు

ఇక సహాయ పాత్రలను పోషించిన అంజలిదేవి, కాంతారావు, శుభ, పద్మనాభం, గిరిబాబు, సూర్యకాంతం, ధూళిపాళగార్లను గూర్చి రాయడాని కేమున్నది ?

సాంకేతిక శాఖలను నిర్వహించిన మహదేవన్, సత్యానంద్, రామకృష్ణరావు ఆత్రేయ, ఆదుర్తి హరనాథ్‌గార్లు ఆయా శాఖలలో నిష్ణాతులయ్యే!

ఈ చిత్రానికి ఆదుర్తి భాస్కర్, ప్రసాద్ నిర్మాతలు శ్రీ ఫిలింస్ విడుదల

"జేబు దొంగ"లో ఒక దృశ్యం



నూరేళ్లపంట

లోగడ పంచరత్న ఆర్ట్స్ ప్రొడక్షన్స్ అనే చిత్ర నిర్మాణ సంస్థ "నూరేళ్లపంట" చిత్రాన్ని నిర్మిస్తున్నట్టు పాఠకులకు తెలిపివున్నాము. చిత్రం పేరు అదే అయినప్పటికీ బ్యానరు పేరును మాత్రం మార్చడం జరిగింది పంచరత్న అప్సర ఆర్ట్స్ ప్రొడక్షన్స్ అయింది.

ఈ చిత్రం తాలూకూ ఒక పాటను యిటీవల విజయా గార్డెన్స్‌లో రికార్డ్ చేశాడు సంగీత దర్శకుడు సత్యం ఈ చిత్రానికి ప్రప్రథమంగా పి సి. రెడ్డి వద్ద శిష్యరికంచేసి, దర్శకత్వ విలువలు తెలుసుకున్న బి యస్ వాసు దర్శకత్వం వహిస్తున్నారు

సత్యనారాయణ, రా జ బా బు, అల్లురామలింగయ్య, పద్మనాథం, రాజశ్రీ, యం పి బాబు, లీలారత్న, యల్. కృష్ణ, విజయ. సూర్యకుమారి



"మాయింటి దేవుడు"లో రాఘవన్, ఫణి

మున్నగు కొత్తవారు ముఖ్యపాత్రలను పోషిస్తున్నారు. యస్ జె. యం. సమర్పించే ఈ చిత్రానికి చౌదరి ఛాయను, పేకేటి రంగా కళను, జీవ్‌బద్రూ మాట అను, నాయని మహేశ్వరరావు కూర్పును సమకూరుస్తున్నారు ఇదొక రంగుల చిత్రం.

చాలాకాలం తరువాత రాజశ్రీకి సరయిన పాత్ర లభించింది



"మావూరి గంగ"లో లక్ష్మి, పిల్లలు

## రచయిత వైభవం

గత ఏడు మూడు హిట్ చిత్రాలకు రచయితగా బాధ్యత వహించిన గొల్లపూడికి యీ ఏడు కూడా అట్టి విజయాన్ని తెచ్చిపెట్టే చిత్రాలు వున్నాయి

"మనుషుల్లో దేవుడు, నిప్పులాంటి మనిషి, దొరబాబు" చిత్రాలకు రచనా రమణీయతను సమకూర్చిన గొల్లపూడి కలానికి ఒక ప్రత్యేకమైన స్పిరిట్ వున్నది.

ఈ ఏడు ఆయన చిత్రాలను కొన్నిటిని చూశాను

లలితా మూవీస్ వారి "చల్లని తల్లి" చిత్రంలో గొల్లపూడి సంభాషణలు బల్ భలేగా వున్నాయి సృజన చిత్ర వారి "అనురాగ్" చిత్రంలో గొల్లపూడి రచన రాతి గుండెలను సయితం కరిగించే విధంగా వున్నాయి. ఈ రెండూగాక, "యాదోంకి బారాత్, గీత్, బంగారు మనిషి, అందరూ బాగుండాలి" చిత్రాలకు గొల్లపూడి కలం పని చేస్తున్నది.

సంభాషణలు సరళంగా వుంటూ, సులభగ్రాహ్యంగా వుంటూ, సగటు మనిషిని మెప్పించే విధంగా వుంటూ వుండడం యితగాడి కలానికి తెలిసినంతగా మరొక కలానికి తెలియదుగాబట్టే, ఎక్కువమందిని ఆకర్షింతడం జరుగుతున్నది

ఈ సంవత్సరం ప్రారంభంలో విడుదలయిన "దేవుడు చేసిన పెళ్లి" కథను రాసినది కూడా నేరాసిన గొల్లపూడే ఇంత నావల్టీ వున్న కథ, నాచురాలిటీ వున్న కథ యీ మధ్యకాలంలో రాలేదేమో!

## జీవనజ్యోతి

వారానికి రెండు మూడు చిత్రాలు రషస్ చూడడం అలవాటైన నాకు, యీ మధ్యకాలంలో ఆకర్షించిన చిత్రం ఒకటుంది ప్రముఖ నిర్మాత డి వి ఎస్ రాజు రంగులలో నిర్మించిన "జీవన జ్యోతి" చిత్రం

చిత్రం ఆరంభం నుంచి అంతం వరకు మధురానుభూతిని కలిగించింది, ఒక కూరకుగాని, పులుసుకుగాని ఎంతెంత పదార్థం ఉపయోగిస్తే, రుచిగా, శుచిగా వుంటుందో, అదేరకంగా ఏ రసం ఎంత మోతాదులో వుంటే, చిత్రం జనరంజకంగా వుండగలదో ననేడి నిజాన్ని దర్శకుడు విశ్వనాథ్ బహు చక్కగా చూపెట్టారు నవరసాలకు సమాన ప్రాతినిధ్యం వొసగిన విశ్వనాథ్‌గారి విశిష్టతను కొనియాడాలి కథ రామలక్ష్మిది మాటలు రామానుజాడివి

"జీవనజ్యోతి" చిత్రానికి మొదటి నాయకుడు దర్శకుడు రెండవ నాయకుడు సంగీత దర్శకుడు. మూడవ నాయకుడు ఛాయాగ్రహణ దర్శకుడు.

నటీ నటులలో శోభన్ బాబు, వాణిశ్రీ, రాజబాబు పోటీ నటన చిత్రానికి హైలైటు. సహాయ పాత్రలను సత్యనారాయణ, శుభ, అల్లు రామలింగయ్య, నిర్మల పోషించారు. ఈ చిత్రం విజయా ద్వారా విడుదలవుతుంది.



## అల్లువారి త్యాగనిరతి

ప్రముఖ నటుడు అల్లురామలింగయ్యను వితరణ గల మనిషిగా పేర్కొనడానికి తగినంత ఆధారం వున్నది

గీతా ఆర్ట్స్ ప్రొడక్షన్స్‌కు యిద్దరు అధినేతలున్నారు. ఒకరు రామలింగయ్య కుమారుడు అరవింద, మరొకరు దాసరి సత్యనారాయణమూర్తి.

తన స్వంత సంస్థలో ఒక ముఖ్యమైన పాత్రను (తను చక్కగా వెయ్యగలిగినది) తను వెయ్యకుండా పోటి నటుడు సత్యనారాయణకు యివ్వడం త్యాగం కాదా?



చిల్లర దేవుళ్లు లో కాంచన

### పద్మశ్రీ ఎక్సెల్స్!

ఈ సంస్థ నిర్మించిన పది చిత్రాలలో ఎనిమిదింటికి ప్రజాదరణ లభించియున్నది ఒకటి రెండు చిత్రాలు ఆర్థికంగా లాభాన్ని తెచ్చిపెట్టలేదుగాని, విలువైన చిత్రాలుగా ప్రేక్షకులచేత అంగీకరించబడ్డాయి

ఆంధ్రోద్యమం సమయాన విడుదలయిన "కొడుకు—కోడలు" జనాన్ని బాగా ఆకర్షించింది

పద్మశ్రీ పదకొండవ చిత్రాన్ని తలపెట్టింది చిత్రానికి "అందరూ బాగుండాలి" అని పేరు పెట్టారు అందరి మంచిని ఆదినుంచి ఆశించే పుల్లయ్యగారికి అందరి ఆదరణ అవశ్యం లభిస్తుంది

మార్చి 26 నుండి వరుసగా యిరవై రోజులు హార్స్‌లీ హిల్స్‌లో షూటింగు జరిగే విధంగా ఆర్టిస్టుల దగ్గర కాల్‌షీట్లు తీసుకోవడం జరిగింది.

ఈ చిత్రానికి గొల్లపూడి రచనను, ఎస్ ఎస్ లాల్ ఛాయాగ్రహణాన్ని, మాష్టర్ వేణు సంగీతాన్ని నిర్వహిస్తున్నారు

పద్మశ్రీ వారి "ప్రేమించి చూడు, వింత కాపురం" చిత్రాలకు వేణు సమకూర్చిన సంగీతం యిప్పటికీ, ఎప్పటికీ మరువలేనిది

"అందరూ బాగుండాలి" చిత్రంలో సత్యనారాయణ — మమత, పద్మనాభం — విజయ, శాంతకుమారి — ధూళిపాళ, కొమ్మినేని ప్రధాన తారాగణం

హీరో పాత్రను జగన్నాథ్ అనే కొత్త నటుడు, హీరోయిన్ పాత్రను సంగీత అనే నూతన నటి పోషిస్తున్నట్టు నిర్మాత వి వెంకటేశ్వర్లు చెప్పారు శ్రీ ఫిలింస్ విడుదల

### శ్రీ నందినీ ఫిలింస్!

"అత్తలు—కోడళ్లు, ఇల్లు—ఇల్లాలు, పండంటి సంసారం" చిత్రాలను అందించిన నందినీ అధినేతలు యీతూరి తమ సంస్థకు "శ్రీ"ని చేర్చారు

శ్రీ నందినీ ఫిలింస్ నిర్మించే మరొక సాంఘికం ఏప్రిల్ నుంచి సెట్స్‌కి వెడుతుంది ఈ చిత్రానికి కథను పి సి రెడ్డిగారి భార్య లలిత రాశారు మాటల రచనను మోదుకూరి జాన్సన్‌కు యిచ్చారు సంగీతానికి మహదేవన్, ఛాయకు సుఖదేవ్, సహకార దర్శకత్వానికి బ్రహ్మానందరావు అధిపతులు.

జె ఏ రామసుబ్బయ్య నిర్మాతగా, కె సుబ్బిరెడ్డి సమర్పకుడుగా శ్రీ నందినీ ఫిలింస్ తలపెట్టిన చిత్రంలో నటించడానికి గుమ్మడి, చంద్రమోహన్, శ్రీధర్, చంద్రకళ, జయసుధ, అల్లు రామలింగయ్య, ఛాయాదేవి, నిర్మల, అంగీకరించారట

నవ్వించే పాత్రలను రాజబాబు, రమాప్రభ పోషించగలరట

నందినీ నిర్మాతలకు పి. చంద్రశేఖరరెడ్డి ఒక్క దర్శకుడుగానే గాక, మిత్రుడుగా, సలహాదారుడుగా, శ్రేయోభిలాషిగా, పున్నత వ్యక్తిగా కనిపిస్తారు

### రాజశ్రీకి మరో ఛాన్సు

ప్రతాప్ ఆర్ట్ ప్రొడక్షన్స్ రచయిత రాజశ్రీని దర్శకుడుగా మార్చింది నిర్మాత రాఘవ ధైర్యం చేసి, రాజశ్రీకి దర్శకత్వం అప్పగించినందుకు 'చదువు—సంస్కారం" చెడగొట్టలేదన్న పేరును సంపాయించగలిగారు

రాజశ్రీని దర్శకుడుగా మరొకరు పెట్టారు శ్రీ విజయలక్ష్మి నరసింహ ప్రొడక్షన్స్ రాజశ్రీకి అయిదింటిని అప్పగించారు కథను, మాటలను, పాటలను, సినిమా అనువాదాన్ని రాయమనడమేగాక



"వయసొచ్చిన పిల్ల" లో అపర్ణ

## సినిమా

దర్శకత్వాన్ని కూడా యిచ్చారు ఈ సంస్థకు టి గోవిందరాజులు అధినేత గుండు సత్యనారాయణ నిర్వాహకుడు

పెద్ద తారాగణం కోసం ప్రాకులాడక, కథకు అనుగుణంగా సరిపడే నటీ నటులను పెట్టాలన్న వుద్దేశ్యం నిర్మాతకు, దర్శకునికి వున్నట్టు తెలుస్తోంది

రాజశ్రీ యీతూరి మరింతగా కృషి సలిపి, ప్రేక్షకులచేత మొనగాడు అనిపించుకోగలరని ఆశిస్తున్నాను

### జడ్జిగా అల్లు, వకీలుగా నాగభూషణం

"వైకుంఠపాళి" చిత్రాన్ని చూడడం జరిగింది వకీలుగా వాదించిన నాగభూషణం, జడ్జిగా తీర్పు నిచ్చిన అల్లురామలింగయ్య గమ్మత్తయిన పాత్రలను పోషించి, అడుగడుగునా ప్రేక్షకులను నవ్విస్తారు

'వైకుంఠపాళి" చిత్రంలో శారద నటన అందరినీ ఆకట్టుకుంటుంది కరుణరస పోషణలో శారదకు సాటేలేరు మరెవరు అని నిరూపించే చిత్రం "వైకుంఠపాళి" ఈ చిత్రానికి కె బాపయ్య దర్శకుడు

ఈమధ్య వస్తున్న చిత్రాలలో కానరాని హాస్య ఘట్టాలు, యిందులో కథతో అతికినట్టు ఉన్నాయి నవ్వులరాజు రాజబాబుది వెరైటీ వేషం ఆయనకు జవరాలు కె విజయ ఇతర పాత్రలను గుమ్మడి, రంగనాథ్, సాక్షిరంగారావు పోషించారు

ఈ చిత్రానికి మహదేవన్ సంగీతాన్ని, పద్మరాజు రచనను, భాస్కరరావు ఛాయను నిర్వహించారు

నిర్మాత రామకృష్ణారెడ్డికి యీ తొలికానుక మేలు చెయ్యొచ్చు లక్ష్మీ విడుదల

### వాణిశ్రీ చిత్రాలు

ఆంధ్ర ప్రేక్షకులచేత అగ్రనటిగా అంగీకరించబడిన వాణిశ్రీని హీరోయిన్‌గా అడిగేవాళ్ల సంఖ్య అధికమవుతూవున్న నిజాన్ని నా కళ్లారా చూశాను నేను వరుసగా రెండురోజులు ఆవిడ యింటికి వెళ్లాను అప్పుడు అయిదారుగురికి చెయ్యలేను అని ఆవిడ చెప్పింది

ఇప్పుడామె నటిస్తున్న చిత్రాలు ఎన్నెన "పింజల సుబ్బారావు నిర్మిస్తున్న 'మాయా మచ్ఛీంద్ర' ఒకటి గోపీనాథ్ — భక్తవత్సలం నిర్మిస్తున్న "రాముని మించిన రాముడు" మరొకటి ఏ వి ఎమ్ చెట్టియార్ నిర్మిస్తున్న రెండు చిత్రాలు సురేష్ నాయుడు చిత్రం, తారాకరామాప్రసాద్ చిత్రం, పుండరీకాక్షయ్య చిత్రం, రంజిత్ కుమార్ చిత్రం"

ఇవిగాక ఎం జి ఆర్ తో మంచివాడు తమిళం, శివాజీగణేశన్‌తో రెండు చిత్రాలునటిస్తున్నది. — శ్రీనివాస్


ప్రొద్దున్న ఉండే తాజాదనం,
సౌరభం రోజంతా
ఉంటుంది!
చన్నీళ్ల స్నానమిచ్చే తాజాదనము గంటల కొలదీ-పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్ ఆ అనుభవమును రోజంతా యిస్తుంది. దానిని మీ ఒళ్లంతా జల్లుకోండి. మీరు తాజాగా, శుభ్రముగా మరియు చల్లగా ఉంటారు. దాని తేలికైన సువాసన మిమ్మల్ని పట్టి ఉంచే, అది చెమ్మను పీల్చి మిమ్మల్ని పొడిగా, సౌఖ్యముగా ఉంచుతుంది, ముఖ్యంగా మండు ఎండా కాలములో. చెమట వాసన, చర్మము బిగపట్టుట ఉండవు. పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్ ఎంత మెత్తగా ఉంటుందంటే దానిని మీ ముఖము మీద కూడ రాసుకోవచ్చును.
పాండ్స్
డ్రీమ్‌ఫ్లవర్
టాల్క్
Pond's
Dreamflower talc
Dreamflower talc
మీడియం, ఫ్యామిలీ, మరియు ఇప్పుడు కొత్తగా 196 గ్రా లార్జ్ సైజ్‌లో లభిస్తున్నాయి.
చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఎ. లో స్థాపితము)
HT-CP-8342

**ఆ దినం చీకటిపడుతుండగా శంకరం నాదగ్గరకు వచ్చాడు! రావడం మామూలుగా రాలేదు! గాల్లో తేలుతున్నట్లుగా వచ్చాడు! లోపలికి వచ్చీ రావడంతోనే "సక్సెస్ ... విజయం..." అంటూ కేకలు వేశాడు!**

# మరపంతులు

రుక్మిణి



ఊపిరి తీసుకుని మళ్లీ ఓసారి అరవబోతే, పిల్లలు భయపడిపోతారని నేనే వారించాను! కుర్చీలో కూర్చుని శంకరం ఆయాసంగా రొప్పుతున్నాడు! లోపల నా భార్య విసుక్కోవడం స్పష్టంగా తెలుస్తుంది!

"ఏమిట్రా? ఇంతకీ సంగతేమిటి?!"

వాడు ఊపిరి గట్టిగా వదిలి ఏమీ చెప్పకుండా లేచి నా చేయందుకొని బయటకు, వీధిలోకి లాక్కొచ్చాడు! వాడెపుడూ అంతే! విషయం సరిగా చెప్పడు...చెప్పింది సరిగా అర్ధమయిచావదు! మేమందరమూ వాడ్ని "తిక్కశంకరయ్య"ని కూడా ఆప్యాయంగా పిలుస్తాం! వాడు ఫిజిక్సులో చాలా డిగ్రీలు, బోలెడంత జ్ఞానం సంపాదించి యూనివర్సిటీలో అత్యున్నత పదవిలో ఉన్నా వాడిలో పిచ్చి చేష్టలు పెరిగాయ్ తప్ప ఏమాత్రం తగ్గలేదు!

వాడి యిల్లు (దాన్నే పరిశోధనాశాలగా కూడా వాడుతుంటాడు) చేరీ చేరగానే ఏకబిగిన ఏకరువు పెట్టాడు!

"ఇంతకాలం నుండి నేను చేస్తున్న కృషి ఫలించినట్లే! సక్సెస్ .. యురేకా . (రెండు మూడు భాషల్లో అననిచ్చానీసారీ) భారతదేశం కూడా "రాబట్" అంటే "మర మనుష్యుల్ని" విరివిగా తయారు చేయగలదు! చూడు ... నేనింత కాలం శ్రమించి "మరపంతులు" కంప్యూటర్ టీచర్ ... తెలుగులో ఖచ్చితంగా ఎలా చెప్పను.. "యంత్రోపాధ్యాయుడనా?" మాటలెందుకు .. నువ్వే చూడు!"

ప్రక్క గదిలో వాడు చూపించిన యంత్రాన్ని చూసి నేను నిరుత్తరుడనయ్యాను ... మనిషి ఆకారం ... సైజులో వున్న ఆ యంత్రం చాలా తమాషాగా వుంది. ముందు నేను మనిషేనేమో అని కూడా అనుకున్నాను! నా కళ్లను నేనే నమ్మలేనటువంటి పరిస్థితి ... కానీ, కంటికెదురుగా దృశ్యం, చెవులో తిక్కశంకరంగాడి రొద ఒకేసారి సరఫరా అవుతుంటే నమ్మకుండా యెలా వుండగలను? మమ్మల్ని చూడగానే "మరపంతులు" "విష్" చేశాడు ... మమ్మల్ని కూర్చోమని కుర్చీలు చూపించాడు! ఆశ్చర్యపోతూ నోరు వెళ్లబెట్టడం తప్ప నేనింకేమీ చేయలేకపోతున్నాను!

మా 'తిక్కశంకరం'గాడు ఉపన్యసిస్తుంటే "మరపంతులు" వినయంగా చేతులు కట్టుకుని నుంచున్నాడు! "ఇక పాఠశాలల్లో ఇలాంటి మర మనుష్యులతో పాఠాలు లాగించెయ్యవచ్చు ... అన్ని సబ్జెక్టులు చెప్పగలిగిన దిట్టంగా దీన్ని తయారు చేశాను! ఆ లావుపాటి పొట్టలోని కంప్యూటర్లకు "టేపులు" కనెక్టుచేసి ఆ టేపుల్లో కావలసిన సిలబస్ ... విషయాలు "ఫీడ్" చేశాను! అడిగిన ప్రశ్న చెవి దగ్గరున్న "మైక్రోఫోను" గ్రహించగానే టేపులు కావలసిన విధంగా "సార్టయి" విషయం నోటి ద్వారా బయటకు వస్తుంది!

ఆయాసంతో వాడు రొప్పుతున్నాడు! నేను అప్రయత్నంగా "మరపంతులు" కేసి తిరిగి "కూర్చోండి" అన్నాను! "మరపంతులు" మంద హాసం లాంటిది చేసి అలాగే నుంచున్నాడు!

"కొన్ని ప్రశ్నలు సైన్సులో అడగరా!" తిక్కశంకరంగాడు నన్ను ప్రోత్సహించాడు.

ఆలోచించి "హైడ్రా అంతర్నిర్మాణము ... దానిలోని కణాలెన్నిరకములు ...

నా మాట నోటినుండి బయటకు వచ్చీరావడంతోనే చాక్‌పీసందుకుని గోడకున్న బ్లాక్ బోర్డుమీద చకచక చక్కని పటం గీస్తూ వివరణ మొదలు పెట్టాడు! స్వచ్ఛమైన, సరళమైన భాష ... నీట్‌గా వేస్తున్న డయాగ్రమ్‌లు ... నా తలతిరిగి పోయింది!

అది అయిన తర్వాత తిక్కశంకరంగాడు లేచి "మరపంతులు" వెనక ఏదో బటన్ నొక్కాడు. "ఇపుడు లెక్కల్లో ఏదయినా అడగరా! దీని వెనక పది బటన్లున్నాయి ... ఏ సబ్జక్టు కావలసివచ్చినపుడు దాన్ని నొక్కాలన్నమాట! ప్రతి పీరియడ్‌కు పోయేముందు, ఆ సబ్జక్టు బటన్ నొక్కి పంపించాలన్న మాట! 'డిసిప్లిన్' విషయం రేపు చూపిస్తా!"

నేను ఆలోచించి, ఆలోచించి 'కాంపోజిట్ మాథ్స్' లో ఓ గట్టి లెక్క అడిగాను ... పెదాల మీది చిరునవ్వు చెరిగిపోకుండా రెండు నిమిషాల్లో లెక్క పూర్తిచేసి, "ఎక్స్‌ప్లనేషను" మొదలు పెట్టింది!

హరి భగవంతుడా!

తిక్కశంకరంగాడు నిజంగా సాధించాడు! ఎవరూ సాధించరనుకున్నదాన్ని వాడు అవలీలగా సాధించాడు. వాడు నా స్నేహితుడు కావడం నిజంగా నా అదృష్టం! ఓహ్ ... తిక్కశంకరం ది గ్రేట్ సైంటిస్ట్ ... హీ ఈజ్ మై ఫ్రెండ్!!

* * *

మర్నాడు మా పాఠశాలంతా జనంతో దాదాపు నిండిపోయింది! తిక్కశంకరం చాలామందిని ఆహ్వానించాడు! సమితి ప్రెసిడెంటు ... స్థానిక యమ్మెల్యే .. ఇంకా పురప్రముఖులు ... ఎందరో "మరపంతుల్ని" చూడ్డానికి తండలు, తండలుగా వచ్చారు! తిక్కశంకరం ఒక్కో సబ్జక్టు టీచర్ని పిలిచి "మరపంతుల్ని" అడిగిస్తున్నాడు! "మరపంతులు" రక రక క్లాసుల్లో బ్లాకు బోర్డుమీద వ్రాస్తూ చక్కగా పాఠాలు చెబుతున్నాడు...అతనిలో అలసట ... విసుగు మచ్చుకైనా కనిపించలే!!

మా సమితి ప్రెసిడెంటు బొళ బొళమని నవ్వి ఉత్సాహాన్ని ప్రకటించాడు ... అతను ఇలాంటి పరిశోధనల గురించి అసలు వినివుండలేదు! మంచి రసికుడని ఆ ప్రాంతాల్లో పేరు పొందినవాడు. "ఏమయ్యా పంతులూ ... మాంచి శృంగారం పద్యమోటి ఇనిపిచ్చమను!"

మా తిక్కశంకరంగాడు ముసి ముసి నవ్వులు నవ్వి, వెనక ఏదో మీట నొక్కాడు! "మరపంతులు" విజయ విలాసంలోని పద్యం శ్రావ్యంగా అందుకున్నాడు! "పయ్యెద జారె... అది సవరించు నంతలో నీవి జారె..." అని! దాని టీకా తాత్పర్యం విన్న తర్వాత మా సమితి ప్రెసిడెంటు ప్రక్కనున్న వాళ్ళను కావిలించుకున్నంతపని చేశాడు!

"ఇక 'డిసిప్లిన్' విషయం చూడండి!"

# పెరిగేవయస్సు ఆరోగ్యవంతముగా అవుతుంది- ఇన్‌క్రిమిన్* తో

బాల్యదశ రోజులు—ఫలపుష్ప భరితంగా పెరిగే రోజులు! ఈ రోజుల్లో పిల్లల శరీరం పూవలాగా వికసిస్తుంది. వీరికి ఇన్‌క్రిమిన్ సిరప్ తప్పక ఇవ్వండి ఇహ చూడండి ఆహారము తినకుండా మారాము చేసే పిల్లల ఆకలి ఎంత పెరుగుతుందో—వీరు తినే, తాగే ఆహార మంతా కూడా వంటికి బాగా పడుతుంది. లాభదాయకమైన విటమిన్లు మరియు ఐరన్‌తో పరిపూర్ణమైన ఇన్‌క్రిమిన్‌లో, ఆహారము యొక్క అన్ని పోషక తత్వములను గ్రహించేందుకు సహాయము చేసే విశేషమైన అమినో ఏసిడ్, లైసిన్, కూడా ఉన్నాయి.




175 ml
Incremin* syrup
VITAMINS B1, B6, B12
LYSINE
WITH IRON
TONIC APPETITE STIMULANT
CHERRY FLAVOUR IS A FAVOURITE WITH CHILDREN OF ALL AGES

## ఇన్‌క్రిమిన్* టానిక్

డ్రాప్స్—శిశువులకు 2 నెలల నుంచి 2 సంవత్సరాల వరకు
సిరప్— 14 సంవత్సరముల వయస్సు వరకు పిల్లలకు

**అధిక ఆహారాన్ని అధిక పెరుగుదలగా మారుస్తుంది తింటున్న ఆహారమంతా వంటికి పట్టేట్టు చేస్తుంది**

డాక్టర్లు విశ్వసించే పేరు—Lederle సయానమిడ్ ఇండియా లిమిటెడ్ వారి ఒక విభాగం

*అమెరికన్ సయానమిడ్ కంపెనీవారి రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కు

Sista's INC-362 I/75-Tel

**ఒక విద్యార్థి**



సినిమాకి వెళ్లటానికి ముందు డైరక్టర్ పేరు... నిర్మాణ సంస్థ పేరు చూసి మరీ సినిమాలు చూసే బి. ఏ విద్యార్థి ఎమ్. మోజెస్, అమ్మాయిలను వెకిలిచేష్టలు చేసి ఏడిపించనని చెప్పాడు. 'తార'లను కాదుకాని, సినిమా కవులను చూడాలని సర్దా. మాలతీ చందూర్ జవాబు లంటే యిష్టం. లైబ్రరీకి వెళ్లడం అలవాటు. ఏ ఎన్. ఆర్. అంటే 'లైకింగ్'. శ్రీమతి ఇందిరాగాంధీ అంటే గౌరవం. ఆటల మీదకన్నా చదువు మీద మోజు. పెద్ద పెద్ద వారి "కొటేషన్‌లు" తీసి కూర్చు చేస్తాడు. పత్రికలలో అంతర్జాతీయ వార్తలు చదువుతానన్నాడు. చాలా మంది 'గొప్ప'వని అనుకుంటూ వున్న మధుపానం, ధూమపానం లాంటి అల వాట్లు లేవని మోజెస్ గట్టిగా చెప్పాడు. ధరలు పెరిగిపోతున్నాయంటే దాని క్కారణం — మనవాళ్ల సంకుచిత స్వభావం అన్నాడు "అబ్బా యిది గవర్నమెంటు జాబేనా? పైన ఎంత ముడుతుంది?" అడుగుతారట చాలా మంది — ఆశయం? — ఏమున్నది... ఆరవ సంతానంగా పుట్టాడు కనుక కాలేజీ చదువులకన్నా జీవితంలో బ్రతుకుతెరువుకు పోవాలన్న అవసరం ఎక్కువైనా — చదివి డిగ్రీ తీసుకోవా లన్నదే, సత్ప్రవర్తన, మంచివాడన్న పేరు సంపాదించాలన్న ఆశయం వున్నా యన్నాడు మోజెస్.

ఉమ్మడి కుటుంబాలకన్నా చిన్న చిన్న కుటుంబాలే బాగా రాణిస్తాయని అతని అభిప్రాయం... బాగా తెలివైన ప్రసంగాలు చేసేవారితో కబుర్లు చెప్పటం హాబీ — అన్నీ మంచి బుద్ధి మంతుని లక్షణాలు గల యీ అబ్బాయికి మంచి భవిష్యత్ వుంటుందని ఆశించ వచ్చు.

*[వీరాజీ]*

## మరపంతులు

మా తిక్కశంకరం స్కూలు మొత్తంలోకల్లా టీచర్లను ఆటలు పట్టించే మెరికల్లాంటి అల్లరిచేసే పిల్లల్ని ఇరవైమందిని ఏరి ఒకదగ్గిర కూర్చోబెట్టి అల్లరి చేయనున్నాడు "మర పంతుల్ని" పాఠం చెప్పనీయకుండా చేద్దామని వాళ్ళెంత ప్రయత్నించినా, వాళ్ళ ఆటలు సాగలేదు! ఇద్దర్ని బెంచీ ఎక్కమని "మరపంతులు" ఆజ్ఞాపించాడు! వాళ్ళు మొండి కేస్తే, ఉక్కునే చేయితో చెవులు పట్టుకుని, అలాగ్గా గాల్లోకి లేపి, బెంచిలమీద నుంచోబెట్టాడు! వెనక నుండి ఎవరో పిల్లికూత కూయబోతే, వాడి నడ్డి మీద ఒకటి చరిచాడు! ఇంకొకడి చెంప వాయ గొట్టాడు! ఇంకో ఇద్దర్ని కళ్ళతో ఉరిమి గజగజ లాడించాడు! చిత్రం! పది నిమిషాల్లో చిన్న గుండు సూది నేలమీద వేస్తే శబ్దం వినిపించేటంత నిశ్శ బ్దంగా క్లాసు మారిపోయింది! "మరపంతులు" పాఠం నిరాఘాటంగా సాగిపోతుంది!

"ఇది నేను నమ్మలేను!" మా హెడ్మాష్టరు చెమట తుడుచుకున్నాడు!

"ఇంపాసిబుల్!" ఇంగ్లీషు మాష్టారు గింజు కున్నాడు! అన్నిటికీ శంకరం చిరునవ్వునే సమా ధానంగా అందించాడు!

"ఇలా చాలామందిని ఫేక్టరీలో తయారుచేసి దేశం మీదికి వదిలితే"—

ఆ మాటలతో మా టీచర్లందరికీ మతులు పోయినట్లయింది! నిజవే! ఇంత పర్ఫెక్టుగా... 'నీట్‌గా', అన్ని సబ్జక్టులలో నీటుగా పాఠాలు చెప్పి 'డిసిప్లిను' అంత చక్కగా 'మెయింటెయిన్' చేస్తున్న యంత్రం ఎంత ఖరీదయితే మాత్రం... తప్పక లభించనీయమే!

ఒయట గ్రౌండులో "మరపంతులు" ఉత్సా హంగా "వాలీబాల్" ఆడిస్తున్నాడు! పిల్లలకు "మరపంతులంటే" అపుడే ప్రేమ, సాన్నిహిత్యం ఏర్పడిపోయింది!

మా యమ్మెల్యేగారు అపుడే ఈ విషయాన్ని సెంట్రలుదాకా ఫోన్ల ద్వారా 'గప్పు' మనిపించాడు!

ఆ సాయంత్రం

'టౌన్ హాల్లో' పెద్ద మీటింగు ఏర్పా టయింది! శంకరం ప్రక్కనే "మరపంతులు" విన యంగా కూర్చుని ఉన్నాడు! వేదికమీద యమ్మెల్యే గారు... పురప్రముఖులు... "క్రీం ఆఫ్ ది టౌన్" అంతా ఉన్నారు! ఈ "మరపంతుల్ని" పేటెంటు చేసి, వేల సంఖ్యలో ఉత్పత్తి చేయడానికి ప్లాన్లు సిద్ధమవుతున్నాయని నాకు చూచాయగా అపుడే తెలిసింది!

యమ్మెల్యేగార్ని ఆ శుభసమయంలో ఉపన్య సించమని అందరూ కోరారు. ఆయన లేచి గొంతు సర్దుకున్నారు! నిలువెత్తు గజమాల ఓటి "మర పంతులు" మెడలో వేశాడు! చప్పట్లు ... ఒకటే చప్పట్లు...వేల జనం కొట్టే చప్పట్లు ... "మర పంతులు" మొహం పాలిపోవడం నేనపుడే గమ నించాను! ఆ పూలమధ్య ఎవరికీ కనిపించలేదుగానీ, "మరపంతులు" గజ గజ వణకడం, దగ్గరగా కూర్చున్న నాకు కనిపించింది! తిక్కశంకరంగాడు యివన్నీ గమనించే స్థితిలో లేడు!

యమ్మెల్యేగారు ఉపన్యాసం మొదలు పెట్టారు—

"పంతుళ్లూ ... ఉపాధ్యాయులు మన దేశా నికి జీవగర్ర...తరగని సంపదవంటివారు... రాబోయే భావితరాలు వీరి చేతుల్లో రూపురేఖలు దిద్దు కుంటాయి అన్నింటిలోకన్నా మహోత్కృ ష్టమూ ... ఉన్నతమూ అయినా ఈ వృత్తి .. ఈ పుపాధ్యాయుల సంక్షేమము ... వారి మహో త్కృష్ట సేవయే మా కర్తవ్యము! ఈ కార్య క్రమంలో ... ఉపాధ్యాయుల ప్రగతి కార్యక్రమాల్లో మా ప్రభుత్వం విశ్రమించబోదు ... దేశాన్ని విజ్ఞాన ప్రదీపం చేస్తున్న వీరికి మా నివాళులు ... (హర్ష ధ్వానాలు) నేడు సుదినం ... భారతదేశ ఉపాధ్యాయ లోకం గర్వించదగ్గ సుదినం! (పెద్దపెట్టున చప్పట్లు ... 'హియర్' 'హియర్' కేకలు!) మేం యిక విశ్రమించం ... ఉపాధ్యాయులూ ... వారి స్థితి గతులను మెరుగుపరచడ నికి మేం తీవ్ర కృషి చేయ గలమని మనవి చేస్తున్నాను. యంత్రమైనా ఏదయినా గానీండి ... ఆ వృత్తి అలాంటి పవిత్ర మయినది ... ఉపాధ్యాయలోకం అత్యున్నత శిఖరం చేరే రోజు కనుచూపుమేరలో వుంది...

"మరపంతులు" గజగజ వణుకుతున్నాడు! ముందుకీ, వెనక్కీ వూగుతున్నాడు ... యింకో క్షణంలో, ఎదురుగా ముందుకు బోర్లా పడి పోయాడు! అతని శరీరంలో నుండి పొగలు లేచాయి! పూలు నలిగిపోయాయి. 'ఆసిడ్లు' ధారలుగా బయటకు కారిపోతున్నాయి! గాజు బల్బులు ఫటఫటమని నలిగిపోతున్నాయి! జుయ్యిఁ మని శబ్దం ... తీగలు ... స్ప్రింగులు ... మరు క్షణంలో "మరపంతులు" చలనంలేకుండా పడి పోయాడు!

తిక్కశంకరం ఏడుపుమొహం పెట్టాడు—

అంతా కోలాహలం ... అలజడి ... యమ్మెల్యే గారు ఉపన్యాసం ఆపుచేశారు!

"మరపంతులు చనిపోయాడు!"

"ఎందుకు?"

"ఎందుకేమిటి? అతను పూర్తిగా మరలతో, కంప్యూటర్లతో నడిచినా, అతనూ పంతులే .. ఉపాధ్యాయుడే! ఏనాడూ వూహించని సన్మానానికి, వాగ్దానాలకి సహజంగానే తట్టుకోలేని తత్వం. "ఇన్‌స్టింక్ట్" కూడా అతనిలో "ఆటోమాటిక్"గా వచ్చేసింది .. ఇంత సంరంభం...ఒక ఉపాధ్యాయుని కింత గౌరవం లభించడం, భరించలేక తన అవతారం చాలించాడు!

"హా!" బాధగా నేను మూలిగాను!

కళ్లమీద పడుతున్న ఎండ చుర్రుమని పిస్తుంటే, లేచి కళ్లు నులుముకుని ఓసారి "హాయ్" మని మూలిగాను! చిరిగిన దుప్పటిలో నుండి బయటకు వెళ్లకొచ్చిన కాలు అందుకుని చిన్నబుజ్జి వేళ్లు లాగుతుంది!

"ఏమిటా నిద్ర ... పిల్లలపుడే లేచారు ... పైగా కలవరింతలూను ... లెండి!" భార్య సీతారత్నం వంటింట్లో నుండి కేకలేస్తుంది!

అంతకు ముందు రోజే "కంప్యూటరు కోర్సులో" "అడ్వాన్స్ స్టడీస్" కోసం కెనెడా వెళుతున్నట్లు నా చిన్ననాటి మిత్రుడు శంకర్రావు "ప్రొఫెసర్ ఇన్ ఫిజిక్సు" వ్రాసిన ఉత్తరంతో, వెధవ బావిగాడు, శశిరేఖ ఆడుకుంటున్నారు! ⊙

# బొట్లుగా కారని హెయిర్ డై




## క్రొత్త ట్రూ-టోన్ జెల్

**ఇదిచిక్కనిది, జెల్లీ లాంటిదిగనుక దీనిద్వారా నెరిపినజుట్టుకు ఎంతో సులభంగా, ఏకరీతిలో ఏమాత్రం గజిబిజి కాకుండా నీటుగా డైయింగ్ చేసుకోవడానికి వీలవుతుంది**

జె. కె. హెలిన్ కర్టిస్ లిమిటెడ్, బొంబాయి 400 038 వారి నాణ్యమైన ఉత్పత్తి.

డై మరియు డెవలపర్ మిశ్రమం చేసినప్పుడు ట్రూ-టోన్ జెల్ చిక్కగా అవుతుంది. జుట్టు కుచ్చులనుండి జారిపోదు. మంచి రీతిలో డై గ్రహింపబడి జుట్టు సహజమైన రీతిలో కనిపించేటట్లుగా చేస్తుంది.

ఇది ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన హెయిర్ డైలను తయారుచేసే **హెలిన్ కర్టిస్** వారి విశేషానుభవంతో తయారుచేయబడిన హెయిర్ డై.

*ట్రూ-టోన్ ద్రవపదార్థపు హెయిర్ డై కూడా దొరుకుతుంది.

ఉచితం
రబ్బర్ గ్లవ్స్
ప్రారంభంతో ప్రత్యేక సదుపాయం... సరుకు ఉన్నంత వరకే

**ట్రూ-టోన్ జెల్‌లో హెయిర్ కండిషనర్ కూడా కలదు!**

దక్షిణ ఇండియాకు డిస్ట్రిబ్యూటర్లు: ప్యారీ & కంపెనీ లిమిటెడ్

everest/39/JKH

## మోక్షమనేది ఏది?

మానవజన్మకు పరమ ప్రయోజనం మోక్షమే అని అందరూ అంగీకరిస్తారు.

మోక్షాన్ని పొందేవారికి ప్రాణోత్క్రమణ సమయంలో విమానం వస్తుందనీ, ముక్తులు దానిపైని కూర్చుండి, ఊర్ధ్వలోకానికి వెళ్లిపోతారనీ కొందరి భావన.

ఇతరలోకాలకంటె పైనున్న లోకాలే అత్యుత్తమములనీ, సంసార బంధాలనుంచి విడుదలపొందినవారు అక్కడికిపోయి నిరంతరంగా సుఖంగా ఉంటారనీ కొందరు భ్రాంతి పడతారు

మోక్షమనేది పయిలోకాలలో లేదనీ, సంసారబంధంనుంచి పూర్తిగా తప్పించుకుని, భూలోకంలో వుండడమే మోక్షమని అనుకొంటారు.

భగవదవతారమూర్తియైన కపిలమహర్షి మాదిరిగా — ఏ పాపకిన్నీ చేరశక్యం కాని పాతాళలోకంలో నిర్వికల్ప సమాధిలో ఉండి,

11-4-1975 శుక్రవారం మొదలు
17-4-1975 గురువారం వరకు

మేషం :— వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. సాటివారిలో గౌరవం లభిస్తుంది. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడతాయి. కావలసిన డబ్బు సమయానికి అందుతుంది. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. విలాస వస్తువులు కొంటారు.

వృషభం :— లాభం రావలసిన వ్యవహారాల్లో [illegible] రావచ్చును. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వారం మధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. శుభకార్యాల విషయంలో అభివృద్ధిని సాధించగలరు.

మిధునం :—ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వారం మధ్యలో మీ తాలూకు వస్తువులు పోవచ్చును. వృత్తిలో ఎవరినీ విశేషంగా నమ్మకం తగదు. వ్యతిరేకమయిన వార్తలను వింటారు. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

కర్కాటకం:— అధికారుల వల్ల జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. [illegible] సాంగత్యం లభిస్తుంది. వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. నూతన వ్యవహా

సీరియల్

# రంగులవల

శ్రీ

పాలడుగు వెంకటేశ్వరరావు

అంలా అలా చకా చకా జరిగిపోతూవుంటే చూస్తూ వుండిపోయేడు భూషయ్య. నోటమాట పెగలలేదు. ధాసేపయాక రాజారావు భూషయ్యని బయటికి తీసుకు వెళ్లేడు.

'బావా! అంతా వింటున్నావుగా. మరల రేపు ఆయన మద్రాసు వెళ్లిపోతాడట. అందుకని అన్నీ తెల్చేస్తున్నాను'– అన్నాడు.

'అహాహా. కానీ కానీ' అని పకిలించాడు భూషయ్య.

'అన్నీ ఫైనలు అయినట్లే. మరి ఇప్పుడు తాంబూలాలు పుచ్చుకొందామా మరి!?'

'కానీ. కానీ.'

'అదిగాదు. తాంబూలాలు పుచ్చుకొంటేనే గాని నిశ్చితమయినట్లుగాదు. నిశ్చితం చేసుకోకపోతే రేపు మద్రాసులో మరొకరు పట్టుకొని అయిన సంబంధాన్ని తన్నుకుపోయే అవకాశం వుంది.'

'అవునుగదా. ఆలస్యమెందుకు మరి?'

'మరి తాంబూలంలో ఒక అయిదు వేలన్నా పెట్టి ఇవ్వకపోతే ఏం బాగుండదు. ఆయన్ని చూసావుగా?'

భూషయ్య చిర్నవ్వు నవ్వాడు.

'నాకన్నీతెలుసయ్యా. కక్కొచ్చినా కల్యాణమొచ్చినా ఆగదనీ తెల్సు. అందుకే అన్నిటికీ తయారయే వచ్చాను' అంటూ పకిలించి బనీను జేబులోంచి ఒక కట్టతీసి లెక్కపెట్టి, అయిదువేలూ ఇచ్చాడు.

అప్పటికప్పుడు కార్యక్రమమంతా అయిపోయింది. భూషయ్య చేత తాంబూలంలో పెట్టి అయిదువేలూ, వక్కలూ చలపతిగార్కి ఇప్పించేడు రాజారావు.

వచ్చే నెలలో తనకి తీరికవుతుందనీ అప్పుడు ముహూర్తాలు పెట్టుకొని వెంటనే పెళ్లి జరిపించేద్దామనీ అన్నారు చలపతి.

[గత సంచిక తరువాయి]

సరేనని సెలవు పుచ్చుకొని వచ్చేసారు.

'అమ్మయ్య. ఎలాగైతేనేం? పని అయింది' అనుకుని తృప్తిగా చుట్టపొగ పీల్చి పకిలించాడు భూషయ్య, రూంకి వచ్చాక మంచంమీద చతికిలపడి.

కాంతమ్మ ఆనందంతో పూర్కొ కూతుర్ని పిచ్చి చూపులు చూస్తూ కూర్చుంది. నీలమ్మ ఒకవిధమయిన అవస్థకి లోనయి వుంది. అది బయటపడకుండా వుండటాన్కి విశ్వప్రయత్నం చేస్తూ వుంది. అవకాశం దొరికినప్పుడల్లా ఎవరూ చూడకుండా రాజారావు వయిపు కొరచూపులు చూస్తూ వుంది. రాజారావు మాత్రం ఇదేమీ పట్టకుండా నవ్వే అలంకారంగా ధరించి హడావుడిగా అటు ఇటు తిరిగేడు.

మరో నాల్గు రోజులుండి, పట్నంలో చూడదగ్గ విశేషాలన్నీ చూసారు.

ధారాళంగా కర్చుపెట్టి మంజుల కోరిన

*జరిగిన కథ 5 :* మంజులను పెండ్లాడే ప్రయత్నంలో వచ్చిన బోసుబాబును భూషయ్యబావ అవమానించి పంపగా, అక్క కాంతమ్మను సంప్రదించడానికి తానే వస్తాడు రాజారావు. మంజులకి వచ్చిన డాక్టర్ సుందర్రావు భూషయ్యకి నచ్చుతాడు. సుందర్రావు అన్నయ్యతో మాట్లాడ్డానికి బయల్దేరి పిల్లి ఎదురు రాగా కొంత హతాశులై వెళతారు రాజారావు, భూషయ్యలు. హైదరాబాద్ వెళ్లి, సుందరావు మేనమామ చలపతిగారితో అన్ని విషయాలు మాట్లాడి సంబంధం ఖరారు చేసుకుంటారు.

కోరికలన్నీ తీర్చాడు భూషయ్య.

అయిదోనాడు ఉభయులూ బయలుదేరేరు. కారు పూరుదాటి బయటపడింది. బ్రహ్మానంద చిత్రపురి దాటాక, భూషయ్య తృప్తిగా పకిలించాడు. చుట్టపొగ వదిలాడు.

'అమ్మయ్య. ఎలాగయితేనేం? పని జరిగింది' అన్నాడు రాజారావుతో.

రాజారావు చిర్నవ్వు నవ్వాడు.

'అలా అనకు బావా! ఇంకా జరగవలసిన తతంగం చాలావుంది. ఒక అధ్యాయం ముగిసింది అను.'

'అదేమిటి స్వామి?'

'అవును మరి. జరగవలసిన తతంగమంతా ముందుగదా వుంది! ఇంకా పెళ్లి జరగలేదు మరి.'

భూషయ్య పక పక నవ్వాడు. 'ఓరి నీ తెలివి దొంగల్దోల! నీ మాటా నిజమేననుకో. అయితే అంతా అనుకోవటం అయింది గదా అని ఆమాట అన్నాను.' అంటు రాజారావు వీపు మీద ఒకదెబ్బ వేసాడు భూషయ్య.

రాజారావు చిన్నపుచ్చుకొన్నాడు.

త్రోవపొడుగూతా భూషయ్య హుషారుగా ఏదో అంటూనే వున్నాడు. రాజారావుని ప్రశ్నలతో విసిగిస్తూనే వున్నాడు. అతన్తో పేళాకోళాలు ఆడుతూనే వున్నాడు. తెప్పమీద ఏరు దాటామన్న సంతోషం భూషయ్యని వుక్కిరి బిక్కిరి చేసింది. పన్నెండుగంటలకి కారు ఖమ్మం చేరింది. ఆపూట ఇంత తిని నిద్దట్లో పడ్డారు. కొన్నాళ్ళతర్వాత భూషయ్య మరల అప్పుడు మంచి నిద్ర పోయాడు.

## 14

ఆ సాయంత్రమే భూషయ్య ప్రయాణమయాడు.

రెండురోజులుండి పోరాదా అంది నీలమ్మ. వీల్లేదని ప్రయాణం జరగాల్సిందేనని అన్నాడు భూషయ్య కూడా కాంతమ్మ బయలుదేరింది.

మంజులకి ఇంకా ఇక్కడ్నే వుండాలని వుంది. ఆ పిల్లకి మరల డాక్టర్ సుందర్రావుని చూడాలని వుంది. ఇంకా సెలవులు పదిరోజులున్నాయి. ఆ పల్లెటూళ్ళో ఏమీ తోచిచావదు. పైగా మనసంతా ఇక్కడ్నేవుండె. అందుకె మంజుల తర్వాత వస్తానని అంది.

ఆ రోజు గోల్కొండకి భూషయ్యా, కాంతమ్మా వెళ్ళారు. వాళ్ళకి స్టేషన్లో ఘనమైన వీడ్కోలు ఇచ్చాడు రాజారావు. వాళ్ళ నటు పంపించి కారులో ఇంటికి రాగానే డబ్బిచ్చి

కారుని పంపించేసాడు. ఆ తర్వాత మిగిలిన పైసలు లెక్కచూసుకుంటే జేబులో సుమారు అయిదువేలదాకా వున్నాయి.

తృప్తిగా నిట్టూర్చి రిక్షాలో క్లబ్బుకి వెళ్ళేడు రాజారావు.

పదిగంటలదాకా టెన్నీసు ఆడేడు. ఆ తర్వాత టేబులుదగ్గర కూర్చుంటే తెల్లారేదాకా లేవబుద్ధిగాలేదు. రాజారావు, వీరేశలింగం, పాములరెడ్డి, చంద్రారెడ్డి ఆ రోజు లతనిఆట ఉధృతం చూసి ఆశ్చర్యపోయేరు. తెల్లారేక ఇంటికివచ్చి చూసుకుంటే జేబులో రెండువేలే వున్నాయి!

'గాలికిపోయిన పేలపిండి కృష్ణార్పితమ్' అనుకుని నిర్వేదంగా నవ్వుకున్నాడు. ఆ రెండో నాడు మంజుల అడిగింది రాజారావుని.

'మామయ్యా! డాక్టర్ దగ్గరికి వెళ్ళి వద్దామా?'

'ఏమ్మా?!' అని ఆశ్చర్యపోయేడు రాజారావు. మంజుల సిగ్గుపడింది. 'కాళ్ళు నెప్పిగా వున్నాయి. ఒకసారి చూపించుకుందామని' నోరు పెగుల్చుకొని అంది.

రాజారావు నవ్వేడు.

'అదెంతపని? అబ్బాయి మనవాడేగా! అలాగే వెడదాం' అని ఆవాళే హాస్పటల్ కి



తీసుకువెళ్ళేడు. ఉయితే డాక్టరు హాస్పటల్లో లేడు. విచారించగా అతను హైదరాబాద్ వెళ్ళేడని తెలిసింది. మంజుల నిరుత్సాహ పడింది. రాజారావు ఆమెకి వివరంగా చెప్పాడు.

'అంతా అనుకున్నట్లే అయింది. చలపతిగారు పిలిపించి వుంటారు. అంతా ఒకటొకటిగా కల్పిస్తోంది. ఇంకా నీకు దిగులు దేనికితల్లీ. మరో నెలరోజులు ఓపికపట్టు. నాతల్లివి గదూ'- అన్నాడు.

ఆనందంతో సిగ్గుతో తలవాల్చింది మంజుల.

ఆ మరుసటిరోజు ఫోనువచ్చింది. డాక్టర్ సుందర్రావు ఫోనుచేసేడు. అంతా మామూలే. తను హైదరాబాద్ వెళ్ళి వచ్చాడట. 'అంతా నాకు తెల్సిందిలే దొంగా! నాకు తెలియకుండానె నన్ను కట్టేసే ప్రయత్నంలో వున్నావన్నమాట!' అంటూ మేలమాడాడు.

మంజుల సిగ్గుపడింది.

మనసు మధురోహలలో తేలిపోయింది.

ఆ తర్వాతి పదిరోజులూ "ముషాల్లా దొర్లిపోయేయి. కలల్లో కరిగిపోయేయి.

మంజుకి అప్పటినుంచీ 'సుందర్రావు హాస్పిటల్'కి వెళ్ళాలంటేనే సిగ్గు అనిపించింది. గుట్టు రట్టయింది. పిడికిలి తెరచుకుంది. అటువంటి సమయంలో సుందర్రావు ఎదుట పడాలంటే మనసు ఎదురు తిరిగింది.

అందుకే— సెలవులన్నీ ఎలాగో గడిపి తిన్నగా ఏలూరు ప్రయాణమయింది.

మంజులని రైలు ఎక్కించి వూపిరి పీల్చుకున్నాడు రాజారావు.

ఆరోజే బోసుబాబునించి ఉత్తరం వచ్చింది. కాలేజీలు తెరిచారట. తాను బాగానే చదువుతున్నాడట. తన మనసు భస్మమయిందట. అవమానం మనసుని రంపపుకోత కోస్తున్నదట, గుండెల్ని మండిపోయేలా చేస్తున్నదట. 'పోనీ నాన్నా! మామయ్య చదువులేనివాడు. అందువలన ఆయన్ని క్షమించాలిసింది. అయినా అత్యాశలకిపోయి కోరికలు పెంచుకోవటం మనదే తప్పు. కాని ఒక విషయమే నా మనసుని తొల్చివేస్తున్నది. మంజుల ఇంత హఠాత్తుగా ఎందుకు మారిపోయిందా? అని. అంతా నా ప్రారబ్ధం. గతాన్ని మర్చిపోవాలని ప్రయత్నిస్తున్నాను. ఇక జన్మలో నా పెళ్ళిమాట తలపెట్టవద్దు. నేను నా దృష్టినంతా చదువుమీద కేంద్రీకరించ దల్చుకున్నాను. నామీద కోపం వస్తే నన్ను క్షమించి ఆశీర్వదించవలసింది. మనకి ఎవరిమీదా పగవద్దు. పగఉన్నచోటునే రగిల్చి కాలుస్తుంది. అందువలన ఎవరికీ, జయం కలగదు. అందర్నీ క్షమించటం నేర్చుకొన్నప్పుడే మనిషి మనిషిగా ఎదిగేది. ఆ దృష్ట్యా అందర్నీ క్షమించమని నేను కోరుకొంటున్నాను' అంటు తల్లినిఅడిగి నమస్కారాలు

చెప్పి ముగించాడు బోసబాబు.

ఆ వుత్తరం చదువుకొని నిర్వేదంతో తల పట్టుకొని కూర్చుండిపోయేడు రాజారావు. మనసు అస్తవ్యస్తమయింది. గతం కళ్ళ ముందు మెదలింది. భవిష్యత్తుని వూహించటానికి బియం వేసింది.

మనిషి రాగద్వేష సహితుడు. మద మాత్సర్య పూరితుడు. కామ, క్రోధ, లోభ, మోహములతో నిండినవాడు. మంచి చెడుల్ని మనసులో నిల్పుకొన్నవాడు కొన్ని కొన్ని పరిస్థితులు తమ తమ ప్రాబల్యాలవలన మనిషిలోని ఆయా గుణాల్ని రెచ్చకొడతవి. బలహీనుడు వాటికి తేలికగా లొంగిపోతాడు.

## రంగుల వల

నిబ్బరంగల్గిన మనిషి అటువంటి వుద్రేకాలకి చోటు ఇవ్వడు. అదృష్టవ్య తను బలహీనుడు.

ఉత్తరం చేత్తో పట్టుకొని ఆలోచనా మగ్నుడయినాడు రాజారావు.

'ఏమండీ? ఇందాకటినుంచి పిలుస్తు వుంటే పలకరూ?' అంటూ వచ్చింది నీలమ్మ.

'చేతిలో ఏమిటది?'

'అబ్బాయి ఉత్తరం రాశాడు'

'బాబు కులాసాగానే వున్నాడనా? ఏమని రాశాడు?'

'బాగానె చదువుతున్నాడట. కులాసాగానె వున్నాడట. నిన్ను అడిగానని చెప్పమన్నాడు. నీ ఆరోగ్యం 'జాగర్త' అని చెప్పమన్నాడు.!

'నా తండ్రే!'

'ఇంకా ఏం రాశాడు.?'

'ఫస్టుక్లాసుకి గట్టిగా కృషి చేస్తున్నానని రాసేడు. కష్టపడి చదువుతున్నాడట. అంతె. ఇంకా ఏం లేదులే.'

'సర్లెండి. రండి. భోజనం వడ్డించాను' అంది నీలమ్మ. రాజారావు లేచి ఆమెని అనుసరించాడు. కాలు చేతులు కడుగుకొని పీట మీద కూర్చున్నాడు.

కాని తృప్తిగా భోజనం చెయ్యలేక పోయాడు. అది అంతె. ఒకోరోజు ఒకో మనిషికి అట్లా అన్పిస్తుంది. మనసు సరిగా లేకపోతే ఏదీ సయించదు! నీలమ్మ గోల పెట్టింది.

'అయ్యొ. అయ్యొ. అదేమిటి? అలా లేచారు?' అంది

'ఏం లేదులేవె. భోజనం హితవనిపించ లేదు. మరేం కంగారు పడకు.' అని మౌనంగా అవతలికి వెళ్ళేడు.

రాజారావుకి రాత్రిళ్ళు సరిగా నిద్రపట్టదు. ఏం తోచదు. మనసు అసహనంతో వూగులాడుతుంది. స్తిమితంలేక కొట్టుకులాడుతుంది. కలలు భయంకరమైన కలలు వస్తాయి. కలత నిద్రల్లో. రాజారావు చిక్కి సగమయ్యాడు!

*15*

నరులు, కేశములు, దంతములు, స్థాన భ్రంశము పొందితే రాణింపవన్నారు పెద్దలు. అట్లాంటిది ఇన్నాళ్లకి ఇప్పుడు భూషయ్య దగ్గర చలమయ్య బాగా చలామణీ కావటం మొదలు పెట్టేడు చిత్రంగా. ఎవరూ లేకపోతే అక్కమొగుడే గతి అన్నట్టు భూషయ్యకి చలమయ్య అవసరం వచ్చింది.

నెలయింది హైద్రాబాదు వెళ్ళి వచ్చి రెణ్ణెల్లు గడిచాయి.

అయినా రాజారావు దగ్గరనుంచి వుత్తరం పత్తరం లేదు!

అక్కడికీ చలమయ్య చేత రెండుత్తరాలు రాయించాడు భూషయ్య.

సమాధానం లేదు.

మూడో వుత్తరం రాయించాడు పట్టు వదలని విక్రమార్కుడిలాగ. జ్యేష్ఠ మాసం వచ్చింది. ఎక్కడమూసినా మేళతాళాలతో పెళ్ళిళ్ళు అవుతూవున్నాయి. భూషయ్యకి వెంపర్లాట ప్రారంభమయింది.




మీ కాఫీని తియ్యగా చేసుకోడానికి
ఇదొక మార్గం
రికరి ఇన్‌స్టెంట్‌ను కొనండి
FREE
Ricory
ఉచితం
300 గ్రాముల
పంచదార
ప్రతి 175 గ్రాముల
డబ్బాతోను
FREE
300 gms
SUGAR
Ricory
INSTANT
HI-STRENGTH


10 ఛవి మార్కు అగ్గి పెట్టెలు
ఉచితం
త్వరపడండి!
స్టాకులు
ఉండగానే


ప్రతి ఒక
50 గ్రాముల
రికరి
ఇన్‌స్టెంట్ తో
Ricory
INSTANT
HI-STRENGTH
A COFFEE CHICORY BLEND
రికరి®
ఇన్‌స్టెంట్
-ప్రత్యేక రుచితో స్పెషల్ కాఫీ




## రంగుల వల

మూడో ఉత్తరానికి రాజారావునుంచి సమాధానం వచ్చింది. తన ఆరోగ్యం బాగుండ లేదట. చలపతిగారు బొంబాయిలోవున్నారట. తొందరపడవద్దనీ నిదానంగా అన్నీ ఏర్పాటు చేద్దామనీ రాసేడు.

రోజు రోజుకీ భూషయ్యలో అసహనం పెరిగింది. చలమయ్యనీ జానకినీ 'పెళ్ళి ఒకటే ఆలోచనలు.

ఒకటికి 'రెండు' బుర్రలు చేరితే అనుమానాలు అధికమవుతాయి.

'ఇదంతా నాకు అనుమానంగా వుందన్నయ్యా. వ్యవహారమంతా గజిబిజిగా వుంది.' అని అభిప్రాయం వెలిబుచ్చేడు చలమయ్య. దాంతో భూషయ్య కాలు నిలవనివాడయ్యేడు.

'వారం రోజులలో బయలుదేరి వస్తున్నానునీ, ఏమయినా సరే ఈ నెలలో పెళ్ళి జరిగిపోవాల్సిందేననీ' ఘాటుగా ఉత్తరం రాయించేడు భూషయ్య రాజారావుకి.

నాలుగో రోజుకి రాజారావునుంచి సమాధానం వచ్చింది.

'డాక్టర్ సుందరరావు అన్నగారు ఈ మధ్యనే గుండెజబ్బు వచ్చి చనిపోయాడు ప్రస్తుతం వున్న అవాంతరం అదే. కనుక మీరు వచ్చినా ప్రయోగంలేదు. తొందర వద్దు. నేను నిదానంగా సంప్రదించి ఉత్తరం రాస్తానని' రాసేడు రాజారావు.

'ఇంకా నిదానం నిదానం అంటూ అఘోరిస్తాడేమిటి? వాడి పిండాకూడు' అంటూ ఆక్రోశించాడు భూషయ్య.

'నువ్వు ఏం అనుకోనంటే నేను ఒకమాట చెవుతాను' అన్నాడు చలమయ్య.

'చెప్పరాదా?' అంటూ విసుక్కున్నాడు భూషయ్య.

'ఇటువంటి విషయాల్లో ముసుకుల్లో గుద్దులాట పనికిరాదు. మనమే వెళ్ళిపోయి తాడో పేడో తేల్చుకు వద్దాము'

''మరి ఆ 'అన్న మహానుభావుడు' చచ్చి కూర్చున్నాడటగద! ఎట్లా చచ్చేది'' చిటపటలాడాడు భూషయ్య.

'పోనీ. ఈనెల కాకపోతే పైనెల. ముహూర్తం పెట్టుకోవటానికి ఏం అభ్యంతరమట?'

'అవున్నిజమే'

'అసలిదంతా చూస్తుంటే నాకేదో అను

# కళ్లముందే కలలు ఫలించిన రోజు

మన రాష్ట్రంలో 70 శాతానికి పైగా ప్రజలు గ్రామాల్లో నివసిస్తున్నారు. వారి ఆశలూ ఆశయాలూ, వారి సుఖాలూ సంతోషాలూ అన్నీ వారు దున్నుకొనే పొలంమీదే ఆధారపడి వున్నాయి. ఆ పొలాన్ని వారు దున్నుకొనే పద్ధతి, దాని ఫలసాయంమీద వారికిగల హక్కు, భుక్తాల తీరుతెన్నులూ ఆ ప్రజల సాంఘిక జీవితం పైనా, ఆర్థిక స్థితిగతుల పైనా ఎంతగానో ప్రభావం చూపిస్తాయి. అందుకే అత్యధికశాతం ప్రజలకు సాంఘిక, ఆర్థిక న్యాయాన్ని కల్పించే ఉద్దేశంతో భూసంస్కరణల చట్టాన్ని శాసనసభ రూపొందించింది

మన రాష్ట్రంలో యీయేడు జనవరి 1 వ తేదీనుండి భూసంస్కరణలు అమలు జరుగుతున్నాయి 1973 వ సంవత్సరపు ఆంధ్రప్రదేశ్ భూసంస్కరణల (భూకమతాల గరిష్ట పరిమితి) చట్టం – అంటే 1973 సంవత్సరపు 1 వ చట్టం – ఆనాటినుండి అమల్లోకి వచ్చింది.

ఈ చట్టంలోని 8 (1) వ సెక్షను ప్రకారం, 1971 జనవరి 24 వ తేదీనగానీ, తరువాతగానీ బదిలీ చేయబడిన లేక ఒక ట్రస్టు ఏర్పాటుచేయబడిన భూమితోసహా 1975 జనవరి 1 వ తేదీనాటికి 10 ఎకరాల మాగాణి లేక 25 ఎకరాల మెట్టభూమికి మించిన భూమి విస్తీర్ణం కలిగివున్న ప్రతివ్యక్తీ, లేక కుటుంబ యూనిట్, ప్రకటించబడన తేదీలగాయతు 30 రోజులలోగా, లేక ప్రభుత్వ ప్రకటనద్వారా పొడిగించబడిన గడువులోగా భూమి వివరాలను ట్రిబ్యూనల్ ముందు ప్రకటించుకోవాలి. 1974 సంవత్సరపు ఆంధ్రప్రదేశ్ భూసంస్కరణల (భూకమతాల గరిష్ట పరిమితి) నిబంధనలలో నిర్ణయించిన 1 వ ఫారం రూపంలో యీ ప్రకటన జరగాలి. ఈవిధంగా ప్రకటించే గడువును ప్రభుత్వంవారు 1975 ఏప్రిల్ 11 వ తేది వరకు పొడిగించారు.



24 (1) సెక్షన్ ప్రకారం ఏ వ్యక్తి అయిన ఉద్దేశపూర్వకంగా, తగిన కారణంలేకుండా యీవిధంగా తమ భూకమతాల వివరాలను ప్రకటనచేయని పక్షంలో రెండేండ్లవరకు జైలుశిక్ష, లేక రెండు వేల రూపాయల జుర్మానాకుగానీ, లేక యీ రెండు శిక్షలకుగానీ పాత్రుడవుతాడు.

భూకమతాల వివరాలు ప్రకటించవలసినవారు ఎక్కువభాగం పల్లెసీమల్లో వుండేవారుగనుక వారికి బాగా తెలియగలందులకై యీ ప్రకటన చేయబడింది.

వెంటనే, గడువులోగా, అందరూ యీ వివరాలు ప్రకటించవలసిందిగా విజ్ఞప్తి.

ఆం. ప్ర. ప్ర. సమాచార, పౌర సంబంధ శాఖ, హైదరాబాదు.

DIPR/503-C3/Advt/75

# ర ం గు ల వ ల

మాంసగా వుంది అన్నయ్యా.'

'అనుమానం లేదు గినుమానం లేదు. నీ తెలివితేటలకి సంతోషించాం గాని ఇక కట్టిపెట్టు' కోపంగా అరిచాడు భూషయ్య. చలమయ్య తో ముడిచాడు.

'రేపే ప్రయాణం. ఏలూరువెళ్ళి అమ్మడ్నికూడా తీసుకువెళ్దాం. మీ ఇద్దరూ కూడా ప్రయాణమవండి, మరి.' అంటూ ఆర్డరు జారీచేసాడు భూషయ్య.

భూషయ్య మనసు గిలగిల కొట్టుకొంటూ వుంది.

అనుమానం అనుమానం అని నిజంగానే అనుమానం కలిగించాడు చలమయ్య.

ఈ చలిమిగాడికి బుద్ధిలేదు. రాజిగాడు మనిషిగాదు. అంటు అనుమానంతో అసహనంతో ఎగిరెగిరి పడ్డాడు. రాత్రల్లా కనులు మూతలు పడలేదు. అవ్యక్తమయిన ఆందోళన ఆరాటం. కసి, ద్వేషం, నవ్వు. చుట్టలు తగలేస్తూ నానా అవస్థలకి లోనవుతూ రాత్రంతా జాగారం చేసాడు భూషయ్య.

బస్సులో ఏలూరు చేరేటప్పటికి నానా అవస్థ అయింది.

మంజులకి విషయం చెప్పేసరికి ఎగిరి గంతేసి తయారయింది. ఇంతమందీ బస్సులు పట్టుకు ప్రయాణించటం అవస్థగా తయారయింది. అయితే అయిందని తెగించాడు భూషయ్య.

ఏలూర్లోనే ఒకకారు మాట్లాడుకుని ఆవేళే బయల్దేరేరు.

దారి పొడుగూతా ఏదో వాగుతూనే వున్నాడు భూషయ్య. ఆందోళనకి గురయిన అతని మనసు నిబ్బరంలేక అస్థిరంగా అయింది.

తెల్లవారు ఝాముకి ఖమ్మం చేరుకొని రాజారావు ఇంటి తలుపు తట్టేరు.

*16*

తలుపుతెరిచి ఆగింతుకుల్ని చూసి ఆశ్చర్యపోయాడు రాజారావు. 'రండి. రండి'అంటూ ఆహ్వానించేడు.

'నా వుత్తరం అందలేదా ?' అన్నాడు.

'అందిందిలే.' అంటు ఏడ్పు మొహాన నవ్వు పులుముకొన్నాడు భూషయ్య.

'ఏదో ఒకటి సెటిల్ చేద్దామని బయలు



పాత్రకి న్యాయం చేకూర్చనేమోనని సందేహం వద్దుసార్ ... అంట్లుతోమడంలో నాకు బాగా సర్వీసుంది.

దేరేమండీ' అన్నాడు చలమయ్య.

'ఏం సెటిల్ చేస్తారు ? డాక్టర్ సుందరావు ఇప్పుడు వూళ్ళోలేడు. రాత్రే హైద్రాబాదు వెళ్లేడు.' అన్నాడు రాజారావు.

'హైద్రాబాదా ? ఎందుకూ ?' అని వివారంగా మొహం పెట్టాడు చలమయ్య భూషయ్యకయితే ఆవేశంతో నోట మాట రావటంలేదు.

'ఎందుకేమిటి ? వుత్తరంలో రాసానుగా. వాళ్ల అన్నగారు పోయేడు. ఆ పని మీద అసలు సుందరావుకి వూపిరి సలపకుండా అయింది.'

'అలాగా. మరి ఎప్పుడు వస్తాడు ?' అని అడిగాడు చలమయ్య.

'ఏమో, తెలీదు. రాత్రేగా వెళ్లింది. అయినా నేను అంతా వుత్తరంలో రాస్తిని. ఇంతట్లోనె తొందరపడి ఎందుకు పరుగెత్తుకొని వచ్చినట్లు ?' అంటు విసుక్కున్నాడు రాజారావు.

భూషయ్యకుఇక దుఃఖమే కరువయింది.

వళ్ళు పట పటమని నూరి అందర్నీ లోలోపలే యమ బూతులు తిట్టుకున్నాడు.

మాటల్లోనె భళ్లున తెల్లవారింది.

'కాలేజిలో పరీక్షలు జరుగుతున్నాయి.' అని చెప్ప ప్రొద్దుటె వెళ్లిపోయాడు రాజారావు. అతిథుల్ని చూడాల్సిన బాధ్యత నీలమ్మమీద పడింది. పూరీలు వత్తుతూ వూళ్లో జరుగుతూవున్న 'ఎగ్జిబిషన్' సంగతి యధాలాపంగా చెప్పింది. ఆ మాట మంజుల చెవిని పడి ఎగిరి గంతేసింది.

టిఫిన్లు కాఫీలు అయేక అందరూ బయులు
ు.

ఎగ్జిబిషన్ చూపి ఇవతల పడేసరికి
యింది బస్టాండు మీదుగా తిరిగి వచ్చే
ు భూషయ్య దృష్టి అనుకోకుండా

## రంగుల వల

సుందరావు హాస్పటల్ మీద పడింది!
హాస్పటల్ తెరిచే వుంది!! రోగులు బారు
లుగా బెంచీలమీద కూర్చుని వున్నారు!

'ఇదేంటి? అప్పటలు పనిచేస్తూవుంది!

ఆగు. ఆగు' అంటు కారు ఆపించాడు
భూషయ్య కారు ఆగింది అందరూ దిగారు.
భూషయ్య లోపలికి దూసుకుపోయాడు.
అందరూ అతన్ని అనుసరించారు.

(ఇంకా వుంది)

# హైదరాబాద్ నోట్ బుక్ —తిరుమల రామచంద్ర

### శివరాత్రి ఉత్సవాలు :

శివరాత్రి నిజంగా వసంత ఋతు ప్రాదుర్భావ కాలోత్సవమని, అంతవరకు ఆరునెలల మహారాత్రిని గడిపిన మన పూర్వులకు రాత్రి చివరిభాగం శివం కరంగా ఈ శివరాత్రి పరిగణితమై ఉంటుందని, లింగోద్భవకాలమంటే రాత్రి తొలగి, తేజోలింగోద్భవ కాలమని వసంత లింగోద్భవ కాలమని, జీవలింగోద్భవ కాలమని నా విశ్వాసం. ఈ శివరాత్రి ఉత్సవాలు జంట నగరాలలోని ఆలయాలలో కలసి ఉన్న శివాలయాలలో, ముఖ్యంగా శాలిబండలోని కాశీ విశ్వ విద్యాలయంలో, ఖైరతాబాద్, మురళీధరబాగ్, గౌళిగూడా, లాలాగుడి ఆలయాలలోని శివమందిరాలలోను విశేషంగా జరిగాయి. జంటనగరాలలో భక్తులు ఇక్కడికి 26మైళ్లలో వున్న కీసర గుట్టకు బ్రహ్మోత్సవార్థం వేలకొలదిగా వెళ్లారు. మేడిచల్ బ్లాకులో వున్న ఈ కీసరగుట్ట రామ లింగేశ్వరుణ్ని శ్రీరాముడు రావణ వధానంతరం అయోధ్యకు తిరిగి వెళ్తూ ప్రతిష్ఠించాడని ఐతిహ్యం. మూడురోజులపాటు జరిగే ఈ కేసరగుట్ట బ్రహ్మోత్సవం సందర్భంగా బ్లాకు అధికారులు వ్యవసాయసంబంధమైన ప్రదర్శనం ఏర్పాటు చేశారు. శాసన సభాపతి శ్రీ దశరథరామరెడ్డి, పలువురు మంత్రులు, శివరాత్రినాడు కీసరగుట్ట రామలింగ స్వామిని దర్శించారు: వారికి మేడిచల్ జిల్లా సమితి అధ్యక్షుడు శ్రీ వీరారెడ్డి స్వాగతం చెప్పారు.

### సంగీత నాటక ఎకాడెమీ ఎన్నికలు :

సంగీతనాటక ఎకాడెమీకి కొన్నేళ్ల తర్వాత, మార్చి మొదటివారంలో ఎన్నికలు జరిగాయి ఈ ఎన్నికలలో రాష్ట్రంలో సంగీత నాటక అకాడెమీ ఆమోదించిన సాంస్కృతిక సంఘాలనుంచి 15 మంది అకాడెమీకి ఎన్నుకోబడ్డారని అకాడెమీ ప్రత్యేకాధికారి శ్రీ జె. బాపురెడ్డి తెలియజేశారు. ఎన్నికైన సభ్యులు వీరు శ్రీయుతులు లంకా సుందరరామయ్య, జి. ఎస్. ఆర్. ఆంజనేయులు, ఎస్. ఎ. బాబారావు, కోరాడ నరసింహారావు, సి. ఎస్. శ్రీనివాసరావు, కె. వి. సుబ్బా రావు, గరిమెళ్ల రామమూర్తి, ఎ. మనోహర్, ఎం. ఎస్. పద్మారావు, బి. ఇంద్రసేనరెడ్డి, మామిడిపూడి ఆనందం, పి. గోవింద చౌదరి, కె. రామస్వామి అయ్యంగారు, సి. ఎస్. గణేశ్వర ఉతార్కర్, ఆర్. దివాకర్‌సింగ్ అని.

### కళాప్రదర్శనం :

ఆంధ్రప్రదేశ్ లలిత్ కళా అకాడెమీ ఫిబ్రవరి 25 నుంచి మార్చి 15 వరకు కళాభవన్‌లో ఏర్పాటుచేసిన 13వ చిత్రకళా ప్రదర్శనం కళాప్రియులను విశేషంగా ఆకర్షించింది. విద్యాశాఖా మంత్రి శ్రీ ఎం. వి. కృష్ణారావు దీనిని ప్రారంభించారు. దీనిలో 69 చిత్రాలు, జలవర్ణ చిత్రాలు, తైలవర్ణ చిత్రాలు, బాతిక్కులు, ఎచ్చింగులు, గ్రాఫిక్కులు, ప్రాచీన రీతులు, నవీన రీతులు—మొత్తం 69 ఉన్నాయి. 10 మందికిబహుమానాలు వచ్చాయి. బహుమానాలు పొందినవారు శ్రీయుతులు పి. గౌరీశంకర్, ఎం. వి. కరీం, నరేంద్రరాయ్, నాజర్ మెహమ్మద్, శ్రీమతి నిర్మలాదత్, సి. ఎస్. ఎన్. పట్నాయక్, జి. రంగా రెడ్డి, డి. ఎల్. ఎన్. రెడ్డి, ఎన్. శ్రీనివాసరావు, శ్రీ డి.దేవరాజు చిత్రం— "కలర్ ఇంటాగ్లియో 74 యు"కు బంగారుపతకం లభించింది.

### హిందూస్థాన్ సమాచార్ రజతోత్సవం :

హిందుస్థాన్ సమాచార్ వార్తాసంస్థ రజతోత్సవం మార్చి 16న రవీంద్ర భారతిలో జరిగినప్పుడు అధ్యక్షత వహించిన కేంద్ర మంత్రిణి డాక్టర్ సరోజినీమహిషి "పత్రికలు వార్తాసంస్థలు రాజ్యాంగం తమకు ఇచ్చిన భావస్వాతంత్ర్యం ద్వారా ప్రజలను విజ్ఞానవంతులను చేయాలి" అని హితవు చెప్పారు. ఉత్సవం ప్రారంభించిన ముఖ్యమంత్రి శ్రీ వెంగళ రావు పత్రికలు గ్రామసీమల వార్తలను ఎక్కువగా ప్రచురించాలన్నారు. వ్యవసాయశాఖా మంత్రి శ్రీ జె. చొక్కారావు ప్రత్యేక సంచికను ఆవిష్కరించారు. శాసన సభాపతి శ్రీ రేబాల దశరథరామిరెడ్డి హిందూస్థాన్ సమాచార్ కృషిని ప్రశంసించారు. ఆహ్వాన సంఘాధ్యక్షుడు శ్రీ కె రాజమల్లు స్వాగతం చెబుతూ కొన్ని పత్రికలు ఉద్రేకకరమైన వార్తలు ప్రచురిస్తున్నందుకు విచారం ప్రకటించారు. వార్తా సంస్థ అధ్యక్షుడు శ్రీ బాలేశ్వర్‌ప్రసాద్ అగర్వాల్ తమ వార్తా సంస్థ పనిచేసే తీరు వివరించారు. ఈ సందర్భంలో తమ జీవితమంతా పత్రికా రచనకు వినియోగించి తద్వారా సంఘానికి అపూర్వ సేవ చేసిన సీనియర్ పత్రికా రచయితలు శ్రీయుతులు తిరుమల రామచంద్ర (తెలుగు) మందుముల నరసింగరావు (ఉరుదూ) మధుసూదన్ చతుర్వేది (హిందీ) గార్లను సంస్థ చందనహారంతో, ఖద్దరుపట్టు శాలువలో సత్కరించింది. తాటిపి ముఖ్యమంత్రి బహూకరించారు. పత్రికా రచయితలు కృతజ్ఞత తెలిపారు.

### కొబ్బరిపీచు పరిశ్రమ :

కొబ్బరి పీచు పరిశ్రమ కేరళ కర్నాటక దేశాలలో ఏవిధంగా అభివృద్ధిలో వున్నదీ పరిశీలించి, ఆ పద్ధతులను మన రాష్ట్రంలోనూ అనుసరించడానికి తగు పథకాలు రూపొందించడానికి 50 మంది సభ్యులున్న ఒక పరిశీలక బృందం త్వరలో ఆ రాష్ట్రాలలో పర్యటిస్తుందని పరిశ్రమ శాఖామాత్యులు శ్రీ బసిరెడ్డి మార్చి 12న శాసనసభలో తెలుపడం చాలాబాగుంది. మనరాష్ట్రంలో శ్రీకాకుళం, ఉభయ గోదావరులు, చిత్తూరు జిల్లాలలో కొబ్బరి పంట, కొబ్బరి చెట్ల పెంపకం ఎక్కువ. నాగరకత హెచ్చుతున్న కొద్దీ గృహాలంకరణ సామగ్రి, జీవితావసర సామగ్రి ఎక్కువ కావడంవల్ల, కల్పవృక్షం వంటి కొబ్బరిచెట్టు సర్వాంగాలూ ఉపయోగించుకొనే పరిశ్రమలు వృద్ధి కావాలి, ఉన్నవాటి విస్తరణ చెప్పనే అక్కరలేదు.

### ఉపశ్రుతి :

"అయ్యా, మా పని మనిషి రజతోత్సవం. మీరు దయచెయ్యాలి" అన్నాడు, మిత్రుడొకడు. "ఏమిటి 25 సంవత్సరాలు అవిచ్ఛిన్నంగా పని చేసిందా ఏమిటి?" అనడిగాను "అబ్బే కాదండీ ఈ సంవత్సరంలో ఇది 25వ పని మనిషి" అన్నాడా మిత్రుడు. ●

ముఖ చిత్రం

కొన్ని సంవత్సరాల నుండి పత్రిక చూస్తున్నా, ప్రతిసారి ఆడముఖం తప్ప, మొగముఖం మచ్చుకైనా కనిపించటంలేదు. ఏం? మన నటులు ప్రజలను ఆకర్షించలేరా? కొన్ని దశాబ్దాల నుంచి దేదీప్యమానంగా వెలుగుతున్న నటశేఖరులు ఎందరు లేరు. ప్రజాభిమానము లేకపోతే వారింత కాలం ఉండేవారా?

ఇలపావులూరి మురళీమోహనరావు, గుంటూరు-2.

## ఉత్తరాలు

బాసుంది

ఆకాశానికి ధరలు అంటుతున్న ఈ రోజుల్లో బ్రెడ్ బాసుంది లాంటి "ఖరీదైన" వంటకాలు కాక చౌకగా తయారయ్యే పౌష్టికాహారాల గురించి రచయిత్రులు వ్రాస్తే బాగుంటుంది.

శ్రీమతి శ్రీదేవి (రామచంద్రపురం)




**Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna**







గ్లాక్సో*
వారి నైసిల్
*ట్రేడ్ మార్క్

ఉదయము స్నానము
తర్వాత శరీరముపై
నైసిల్ చల్లుకోండి...



ప్రిక్‌లీహీట్ బాధ
మీకు తెలియదు.

వైద్య పరీక్షల అనుసారం ఎక్కువ చెమట స్వేద గ్రంథులను మూసివేయటము వల్ల ప్రిక్‌లీహీట్ వస్తుంది. దురద, బాధ కలుగుతుంది. ఇది ఇలా వ్యాపిస్తూనే ఉంటుంది. క్లోరోఫెనెసిన్ మరియు బోరిక్ పౌడర్ కల్గిన నైసిల్ 'ట్లా' మాత్రమే దీనిని ఆపగలదు. ఇంకా ఇందులో మిశ్రితమైన జింకు ఆక్సైడ్ శరీరమునకు ఉపశాంతి మరియు రక్షణ ఇస్తుంది.

SISTA'S-GN-410 TL



ఏ.వి.యం.సెజర్ సమర్పించు

మారుతీ ప్రొడక్షన్స్ వారి

# బాబు

ఈస్ట్‌మన్ కలర్

కథ
...స్. ప్రకాశరావు

...టలు, పాటలు
...చార్య ఆత్రేయ

డైరెక్టర్ ఆఫ్ ఫోటోగ్రఫీ
విన్సెంట్

సంగీతం
చక్రవర్తి

...కె.రాఘవేంద్రరావు బి.ఎ.